జయ జయ శంకర
హర హర శంకర

శ్రీ

జయ జయ శంకర
హర హర శంకర

# కంచి కామకోటి పీఠ పంచాంగము







స్వస్తి శ్రీ చాంద్రమాన
ప్లవ నామ సంవత్సర పంచాంగము
2021 - 2022

## శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు
## జగద్గురువులు



## శ్రీ పరమాచార్యుల వారు
(శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ శ్రీచరణులు)

# శ్రీ దుర్గా పఞ్చరత్న స్తోత్రమ్

1 తే ధ్యాన యోగానుగతా అపశ్యన్
త్వామేవ దేవీం స్వగుణైర్నిగూఢామ్ ।
త్వమేవ శక్తిః పరమేశ్వరస్య
మాం పాహి సర్వేశ్వరి మోక్షదాత్రి ॥

2 దేవాత్మశక్తిః శ్రుతి వాక్యగీతా
మహర్షి లోకస్య పురః ప్రసన్నా ।
గుహాపరం వ్యోమ సతః ప్రతిష్ఠా
మాం పాహి సర్వేశ్వరి మోక్షదాత్రి ॥

3 పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయసే
శ్వేతాశ్వ వాక్యోదిత దేవి దుర్గే ।
స్వాభావికీ జ్ఞాన బల క్రియాతే
మాం పాహి సర్వేశ్వరి మోక్షదాత్రి ॥

4 దేవాత్మ శబ్దేన శివాత్మ భూతా
యత్కూర్మ వాయవ్యవచో వివృత్యా ।
త్వం పాశ విచ్ఛేదకరీ ప్రసిద్ధా
మాం పాహి సర్వేశ్వరి మోక్షదాత్రి ॥

5 త్వం బ్రహ్మ పుచ్ఛా వివిధా మయూరీ
బ్రహ్మ ప్రతిష్ఠాస్యుపదిష్ట గీతా ।
జ్ఞాన స్వరూపాత్మ దయాఖిలానాం
మాం పాహి సర్వేశ్వరి మోక్షదాత్రి ॥

**శ్రీ పరమాచార్యుల వారు ఐక్యరాజ్యసమితి (U.N.O) ద్వారా**
**సమస్త మానవాళికి అనుగ్రహించిన దివ్య సందేశము**

23-10-1966 నాడు శ్రీమతి M.S. సుబ్బలక్ష్మి గారు దీనిని U.N.O. వారి సభాభవనమున గానము చేసిరి.

శ్లో॥ మైత్రీం భజతాఖిల హృద్జైత్రీం
ఆత్మవదేవ పరానపి పశ్యత ।
యుద్ధం త్యజత స్పర్థాం త్యజత
త్యజత పరేష్వక్రమ మాక్రమణమ్ ॥

తా॥ అందరి హృదయములను జయించు మైత్రిని పెంచుము. ఇతరులనందరిని నీవలెనే చూచుకొనుము. యుద్ధమును, స్పర్థను త్యజించుము. ఇతరులపై అక్రమ ఆక్రమణను వదలి పెట్టుము.

శ్లో॥ జననీ పృథ్వీ కామదుఘాస్తే
జనకో దేవ స్సకలదయాళుః ।
దామ్యత దత్త దయధ్వం జనతాః
శ్రేయో భూయాత్ సకలజనానామ్ ॥

తా॥ పుడమి తల్లి అన్ని కోర్కెలను పిదుకగలదు. తండ్రి పరమేశ్వరుడు అందరియెడ దయాళువు. ఓ! ప్రపంచ ప్రజలారా! దయా దాన నిగ్రహాదులను అలవరచు కొనుడు. మీకెల్లరకు శ్రేయమగుత.

శ్రీరామ

స్వస్తి శ్రీ చాన్ద్రమాన

# ప్లవ నామ సంవత్సర
# కామకోటి పీఠ పంచాంగము

## 2021 - 2022

శ్రీ శ్రీ శ్రీ గురు చన్ద్రశేఖర జయ శ్రీ శంకరేన్ద్రాకృతి ష్వాస్తే యా త్రిపురా త్రిశక్తి రుచిరా వేదత్రయాతిత్రికా।
యాకాప్యాయతన త్రయేజ్యమహిమా సచ్చిత్సుఖా తత్త్వతః కామాక్షీ పరిపాతు న స్సకలదా సైకామ్రనాథా సదా॥
శ్రీ శ్రీ జయేన్ద్ర విజయేన్ద్ర సురూపతో యా - శ్రీ చన్ద్రశేఖర మహా గురు దివ్యమూర్తిః।
శ్రీ కామకోటి గురుపీఠ మధిష్ఠితాఽఽస్తే - సా భా జగన్తి పరిపాతు సమస్త కాలమ్॥
దేవీ జయేన్ద్ర వినుతా విజయేన్ద్ర గీతా శ్రీ చన్ద్రశేఖర నుతా చ జనార్దనేడ్యా।
త్రైవేదికీ త్రిపురుషా విగతత్రికా సా త్రైకాలికీ సకరుణావతు కామకోటిః॥


రచయిత

శ్రీ కాంచీ కామకోటి పీఠ ఆస్థాన సిద్ధాంతి

**శ్రీ కుప్పా శ్రీ ఆంజనేయ శాస్త్రి**

శ్రీ వేదవ్యాస పాఠశాల,
ప్లాట్ నెం.65, ఇ.నెం. 5-78/65, నవోదయ ఎన్‌క్లేవ్, కుంట్లూరు,
(నాగోలు నుండి గౌరెల్లి - ఘటకేసర్ కు వెళ్ళే రోడ్డు) హైదరాబాద్ - 501 505.
https://goo.gl/maps/sgGkm9vuJvM2
☎ 09492888088, 040-29887088, e-mail : kuppasastry@gmail.com



ప్రాప్తి స్థానము

**శ్రీ కాంచీ కామకోటి పీఠము**

శ్రీమఠం సంస్థానము, రోడ్ నెం. 1, శాలై స్ట్రీట్, కాంచీపురం, తమిళనాడు.

ప్రచురణ

**దర్భా సనాతన విద్యా ప్రచార కేంద్రం (రి)**

302, కళా మాన్షన్, సరోజినీదేవీ రోడ్, సికింద్రాబాద్ - 500003.

*With Best Compliments from :*

ప్రాతః స్మరణీయులు, కృష్ణాజిల్లా దివి తాలూకా ఘంటశాల గ్రామ వాస్తవ్యులగు

**మా తల్లిదండ్రులు**





## స్వర్గీయ పిశుపాటి యజ్ఞనారాయణ గారు

## స్వర్గీయ పిశుపాటి కమలమ్మ గార్ల

**జ్ఞాపకార్థం**



**పిశుపాటి నాగభూషణం, పిశుపాటి వేంకట శాస్త్రి, పిశుపాటి బాలకృష్ణ శాస్త్రి, పిశుపాటి భాస్కర రావు**

సఫిల్‌గూడ, హైదరాబాద్ – **500047.** ఫోన్ : **9866 207 553**

---

*With Best Compliments from :*





## Dr. K.V.R. SASTRY

**M.S (Gen) M.S. (Neurosurgery) M.Sc (Med) Ph.D**

**Consultant Neurosurgeon**



**"Kamal" 3-4-502, Barkatpura, Hyderabad - 500 027**

**Ph : (C) 040 - 2756 4242, (R) 040 - 2756 5866**

**Cell : 9246113305**

**E-Mail : kollurivrsastry@hotmail.com**

---

*With Best Compliments from :*

**Perfect Offshore Partner**







## Valueshore Infotech Pvt. Ltd.

Plot No. 991/B, Road No. 48,
Jubilee Hills, Hyderabad - 500 033.

श्री चन्द्रमौलीश्वराय नमः

श्री श्री श्री श्रीशङ्कर भगवत्पादाचार्य परम्परागत मूलाम्नाय सर्वज्ञपीठम्



**श्रीमत्परमहंस परिव्राजकाचार्यवर्य श्री काञ्ची कामकोटि पीठाधिपतयः**

# जगद्गुरु श्री शङ्कराचार्य स्वामिनः

श्रीमठं संस्थानम्, कांचीपुरम्.



## श्रीमुखम्

**15-01-2009**

स्वस्ति श्रीमदखिल भूमण्डलालङ्कार त्रयस्त्रिंशत्कोटि देवता सेवित श्रीकामाक्षीदेवी सनाथ - श्रीमदेकाम्रनाथ - श्रीमहादेवी सनाथ - श्रीहस्तिगिरिनाथ - साक्षात्कार परमाधिष्ठान - सत्यव्रत नामाङ्कित - काञ्ची दिव्यक्षेत्रे शारदामठ सुस्थितानां - अतुलित सुधारस माधुर्य कमलासन कामिनी धम्मिल्ल सम्फुल्ल मल्लिका मालिका निष्यन्द मकरन्द झरी सौवस्तिक वाङ्निगुम्भ विजृम्भणानन्द तुन्दलित मनीषिमण्डलानां - अनवरताद्वैत विद्याविनोदरसिकानां - निरन्तरालङ्कृतीकृत शान्ति दान्ति भूम्नां - सकल भुवन चक्र प्रतिष्ठापक श्रीचक्र प्रतिष्ठाविख्यात यशो ॐ लङ्कृतानां - निखिल पाषण्ड षण्ड कण्टकोत्पाटनेन विशदीकृत वेद वेदान्त मार्ग षण्मत प्रतिष्ठापकाचार्याणां - श्रीमत्परमहंस परिव्राजकाचार्य श्रीमच्छङ्कर भगवत्पादाचार्याणां महनीयाधिष्ठाने सिंहासनाभिषिक्तानां श्रीमच्चन्द्रशेखरेन्द्र सरस्वती श्रीचरणानां अन्तेवासिवर्यैः श्रीमज्जयेन्द्रसरस्वतीसंयमीन्द्रैः तदन्तेवासिवर्यैः श्रीमच्छङ्कर विजयेन्द्र सरस्वती संयमीन्द्रैश्च अस्मन्मठास्थानविद्वद्रूपेण पञ्चाङ्गनिर्मातॄणां **श्री कुप्पा श्री आञ्जनेय शास्त्रिणां** सर्वाभीष्टसिद्धये क्रियते नारायणस्मृतिः।

श्रौतस्मार्तादि सकल सत्कर्मानुष्ठान साधनभूते जटिल गणितसाध्ये पञ्चाङ्गगणनविषये तत्र तत्र दृश्यमाना पण्डित विप्रतिपत्तिः प्रजासामान्य विभ्रान्तिकरी तत्त्वविदां च विषादकरी कथञ्चिद्वरीवर्ति।

परन्तु या पद्धतिः अन्तरिक्षे प्रत्यक्षतो वर्तमानानां ग्रहाणां यथार्थस्थिते रभिव्यञ्जने समर्था सैव गणितसंज्ञार्हेति बहुलोपशाखाबन्धुरे त्रिस्कन्धज्योतिश्शास्त्रे विस्पष्टं विजानन्त्येव।

तत्तादृशेन **दृग्गणितरीति** रिति इदानीन्तने काले व्यवह्रियमाणेन विद्वद्गुरु परम्परामोद सम्भावितेन गणितविधानेन कालगणनं यथाशास्त्रं कुर्वाणाः सप्रमाणं पञ्चाङ्गप्रणयने च प्रवर्तमानाः आन्ध्रदेशीय श्रीशैलमहाक्षेत्रवासिनः आयुष्मन्तः **कुप्पाभिजनाः श्री आञ्जनेयशास्त्रिणः** अस्माकं सूचनानुसारं दृग्गणितरीत्या पञ्चाङ्गमारचयन्तीति प्रमोदभरितान्तरङ्गा भवामः।

एते शास्त्रिणः - ये श्री श्री परमाचार्याणां परमान्तरङ्गिकाः, पीठस्य चात्यन्तमुख्याः, ब्रह्मविद्वद्वरिष्ठा स्तुरीयाश्रमं स्वीकृत्य **श्री जनार्दनानन्द सरस्वती स्वामिन** इति प्रसिद्धा ब्रह्मभूयङ्गताश्च - तेषां **साङ्गस्वाध्यायभास्कर** इति बिरुदस्यालङ्कार भूतानां सुप्रसिद्ध वेद वेदाङ्ग वेदार्थ वेदान्त शास्त्र विदुषां - आन्ध्रदेशीय कुप्पाभिजनानां - **श्री लक्ष्मावधानि महोदयानां** पौत्राः - साम्प्रदायिक स्वाध्याय प्रवचन सम्पन्नाश्च।

त एते **कामकोटि मठास्थान ज्योतिषविद्वद्रूपेण** पञ्चाङ्गकर्तारः अस्मत्प्रियशिष्याः श्रीमहात्रिपुरसुन्दर्यम्बा समेत श्रीचन्द्रमौलीश्वर कृपया उत्तरोत्तराभिवृद्धिं प्राप्नुवन्त्विति - इतः प्रभृति श्रीकामकोटि शङ्करमठमुद्रा विराजमानं शास्त्रीयपञ्चाङ्गं जगदुपकृतये प्रकटीकुर्वन्त्विति च सादराभ्यनुज्ञापुरस्सरमाशास्महे।

।। नारायणस्मृतिः ।।

శ్రీరామ

**శ్రీశ్రీశ్రీ కంచి–కామకోటి పీఠాధిపతులు జగద్గురువులు పరమహంస పరివ్రాజకాచార్యవర్యులు**

## శ్రీ శ్రీ శ్రీ జయేన్ద్ర సరస్వతీ శ్రీ చరణులు మరియు శ్రీ శ్రీ శ్రీ శంకర విజయేన్ద్ర సరస్వతీ శ్రీ చరణులు

**అనుగ్రహించిన శ్రీముఖము నకు అనువాదము.**

స్వస్తి శ్రీమదఖిల భూమణ్డలాలఙ్కార త్రయస్త్రింశత్కోటి దేవతా సేవిత శ్రీ కామక్షీ దేవీ సనాథ శ్రీమదేకామ్రనాథ – శ్రీ మహాదేవీ సనాథ శ్రీహస్తిగిరినాథ సాక్షాత్కార పరమాధిష్ఠాన – సత్యవ్రత నామాఙ్కిత – కాఞ్చీ దివ్య క్షేత్రమున – శారదామఠ సుస్థితులును – అతులిత సుధారస మాధుర్య కమలాసన కామినీ ధమ్మిల్ల సంఫుల్ల మల్లికా మాలికా నిష్యన్ద మకరన్ద ఝరీ సౌవస్తిక వాఙ్నిగుంభ విజృంభణానన్దతున్దలిత మనీషి మండలులును – అనవరతాద్వైత విద్యా వినోద రసికులును – నిరన్తరాలఙ్కృతీకృత శాన్తి దాన్తి భూషణులును – సకల భువన చక్ర ప్రతిష్ఠాపక శ్రీచక్ర ప్రతిష్ఠా విఖ్యాత యశోఽ లఙ్కృతులును – నిఖిల పాషణ్డ షణ్డ కణ్టకోత్పాటనముచే విశదీకృత వేద వేదాన్త మార్గ షణ్మత ప్రతిష్ఠాపకాచార్యులును అగు – శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యుల వారి మహనీయాధిష్ఠానమున సింహాసనాభిషిక్తులగు శ్రీమచ్చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ శ్రీచరణుల యొక్క అన్తేవాసివర్యులగు శ్రీమజ్జయేన్ద్ర సరస్వతీ సంయమీన్ద్రులవారును – వారి అన్తేవాసివర్యులగు శ్రీమచ్ఛంకర విజయేన్ద్ర సరస్వతీ సంయమీన్ద్రులవారును – తమ మఠాస్థాన విద్వాంసుడై పంచాంగ నిర్మాతయగు శ్రీ **కుప్పా శ్రీ ఆంజనేయశాస్త్రి** గారికి సర్వాభీష్టసిద్ధియగునట్లు నారాయణ స్మరణ పూర్వకముగ అనుగ్రహించుచున్న శ్రీముఖము.

శ్రౌత స్మార్తాది సకల కర్మానుష్ఠానమునకు సాధనము, జటిల గణిత సాధ్యమును అగు పంచాంగ విషయమున కొందరు పండితుల మధ్య ఏర్పడిన అభిప్రాయభేదములు సామాన్య ప్రజలను కలవర పెట్టుచు – శాస్త్రతత్త్వము తెలిసిన విద్వాంసులకు విషాదకరములగుచున్నాయి.

నిజమునకు ఆకాశమున ప్రత్యక్షముగ దృగ్గోచరములై సంచరించుచున్న ఆయా గ్రహముల యథార్థ స్థితి గతులను సరిగ అభివ్యక్తము చేయగల గణిత పద్ధతియే నిజమగు గణిత పద్ధతి యనదగునని – అనేక శాఖోపశాఖాబన్ధురము, త్రిస్కన్ధాత్మకమును అగు జ్యోతిషశాస్త్రమున విస్పష్టముగ తెలియుచున్నదే. విద్వాంసులు, గురువులు పరంపరగా ఆమోదించి గౌరవించుచున్న ఆ పద్ధతే – నేటికాలమున "**దృగ్గణిత పద్ధతి**"యని వ్యవహరింపబడుచున్నది.

మా సూచన ననుసరించి – చిరంజీవులు **కుప్పా శ్రీ ఆంజనేయ శాస్త్రి** గారు ఆ దృక్పద్ధతిలోనే ప్రామాణికముగ శాస్త్రీయమైన పంచాంగమును రచించుచున్నారని మిక్కిలి ఆనందించుచున్నాము.

ఈ శాస్త్రి గారు శ్రీశ్రీశ్రీ పరమాచార్యులవారికి పరమాన్తరంగికులు, పీఠమునకు అత్యన్తముఖ్యులు, బ్రహ్మవిద్వద్వరిష్ఠులై తురీయాశ్రమమును స్వీకరించి **శ్రీ జనార్దనానన్ద సరస్వతీ స్వాములవారు** అని ప్రసిద్ధులై బ్రహ్మీభూతులైన – సుప్రసిద్ధ వేద వేదాఙ్గ వేదార్థ వేదాన్తశాస్త్ర విద్వాంసులు, సాఙ్గస్వాధ్యాయ భాస్కరయను బిరుదునకు అలంకారమైనవారును అగు **శ్రీ కుప్పా లక్ష్మావధాని** మహోదయుల పౌత్రుడు – సాంప్రదాయకుడు – స్వాధ్యాయ ప్రవచన సంపన్నుడు కూడా.

**కామకోటి పీఠ ఆస్థాన జ్యోతిష విద్వాంసుడుగ** ఇట్టి ప్రామాణిక పంచాంగ రచనజేయుచు – మాకు అత్యన్త ప్రియ శిష్యుడైన ఈ **శ్రీ కుప్పా శ్రీ ఆంజనేయ శాస్త్రి గారు** మహాత్రిపురసున్దర్యంబా సమేత శ్రీ చన్ద్రమౌళీశ్వర స్వామివారి కృపచే – ఉత్తరోత్తరాభివృద్ధి నందవలెననీ – ఇప్పటి (2009 సంవత్సరము) నుండి ఇతను లోకోపకారార్థము శ్రీ కామకోటి శంకర మఠ ముద్రా విరాజమానమగు శాస్త్రీయ పంచాంగమును రచించి ప్రకటించుచుండవలెననియును – సాదరముగ అభ్యనుజ్ఞాపూర్వకముగ ఆశాసించుచున్నారము.

**–నారాయణ స్మృతిః**

# స్వస్తి శ్రీ చాన్ద్రమాన ప్లవ నామ సంవత్సర పంచాంగము 2021-2022

- ఓమ్ -

**వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే।**
**యం నత్వా కృత కృత్యాస్స్యుస్తన్నమామి గజాననమ్॥**
సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి ।
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ॥
**కారణపరచిద్రూపా కాఞ్చీపురసీమ్ని కామపీఠగతా।**
**కాచన విహరతి కరుణా కాశ్మీర స్తబక కోమలాంగలతా॥**
**చిన్తిత ఫల పరిపోషణ చిన్తామణి రేవ కాఞ్చినిలయా మే।**
**చిరతర సుచరిత సులభా చిత్తం శిశిరయతు చిత్సుధాధారా॥**
శివనామని భావితేఽ తరంగే మహతి జ్యోతిషి మానినీ మయార్ధే ।
దురితాన్యపయాన్తి దూరదూరే ముహు రాయాన్తి మహాన్తి మంగళాని ॥
**స శంఖ చక్రం సకిరీట కుండలం సపీత వస్త్రం సరసీరుహేక్షణమ్।**
**సహార వక్షస్థలశోభి కౌస్తుభం నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్॥**
ఆదిత్యాయ చ సోమాయ మంగళాయ బుధాయ చ ।
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః ॥
సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమామ్ ।
అస్మదాచార్య పర్యన్తాం వందే గురు పరంపరామ్ ॥
గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।
నిధయే సర్వ విద్యానాం దక్షిణామూర్తయే నమః ॥
శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయమ్ ।
నమామి భగవత్పాద శంకరం లోకశంకరమ్ ॥
**త్రయీమయం త్రయీవేద్యం త్రయీధర్మప్రవర్తకమ్।**
**త్రిమూర్తిం కాల విజ్ఞాన బోద్ధారం నౌమి భాస్కరమ్॥**
**యే మయాద్యాశ్చ మన్వాద్యా వరాహమిహిరాదయః।**
**మాధవాద్యాః కేత్కరాద్యాః కాలధర్మ ప్రబోధకాః॥**
**సిద్ధాన్త కరణగ్రన్థ ధర్మశాస్త్రాది రూపతః।**
**సత్సంప్రదాయ గురవ స్తేభ్యో నిత్యం నమో నమః॥**
**శ్రీ శ్రీ శ్రీ గురు చన్ద్రశేఖర జయ శ్రీ శంకరేన్ద్రాకృతి –**
**ష్వాస్తే యా త్రిపురా త్రిశక్తి రుచిరా వేదత్రయాతిత్రికా ।**
**యాకాప్యాయతన త్రయేజ్యమహిమా సచ్చిత్సుఖా తత్త్వతః**
**కామాక్షీ పరిపాతు న స్సకలదా సైకామ్రనాథా సదా ॥**
**శ్రీ శ్రీ జయేన్ద్ర విజయేన్ద్ర సురూపతో యా**
**శ్రీ చన్ద్రశేఖర మహా గురు దివ్యమూర్తిః ।**
**శ్రీ కామకోటి గురుపీఠ మధిష్ఠితాఽఽస్తే**
**సా భా జగన్తి పరిపాతు సమస్త కాలమ్ ॥**
దేవీ జయేన్ద్రవినుతా విజయేన్ద్రగీతా శ్రీ చన్ద్రశేఖరనుతా చ జనార్దనేడ్యా ।
త్రైవేదికీ త్రిపురుషా విగతత్రికా సా త్రైకాలికీ సకరుణావతు కామకోటిః ॥

**పుష్పత్రయం షట్ఫలాని మధ్భక్తానాం సదేతి యః ।**
**శ్రేష్ఠః కరై స్సూచయన్స్వాన్ భక్తాన్పాతి దయామయః ।**
**దత్తాత్రేయ స్సర్వగామీ సచ్చిదానన్దవాహినీ**
**దద్యాచ్ఛ్రీ విజయానన్ద తీర్థం చాపి సదాపి నః ॥**
**అహైతుక ప్రేమ సుధార్ణవానాం ధర్మైకరక్షా పరినిష్ఠితానామ్।**
**శ్రీశ్రీ శివానన్ద గురూత్తమానాం పాదారవిన్దే ప్రణమామి నిత్యమ్॥**
**సమాజ కల్యాణ విధాయకానాం వివేక విజ్ఞాన విభూతి ధామ్నామ్।**
**శ్రీశ్రీ శివానన్ద మహోదయానాం పాదారవిన్దే శరణం మమ స్తామ్॥**
**శ్రీశ్రీ శివానన్ద సుమూర్తిభాజాం శ్రీశ్రీ శివానన్ద సునామభాజామ్।**
**శ్రీ శ్రీ శివానన్ద పద ప్రదే శ్రీ శ్రీ శ్రీ శివానన్ద పదే నతోఽస్మి॥**
విద్యాగురు ప్రార్థన
**వేద వేదాంగ వేదార్థ వేదాన్తాది విదీడితమ్।**
**తప స్స్వాధ్యాయ నిరతం నిత్యాగ్న్యాదివ్రతం శుచిమ్॥**
**సత్సంస్కారం సదాచారం వాస్తు జ్యోతిః కళానిధిమ్।**
**వేద జ్యౌతిష సాహిత్య వ్యాకృత్యాదిషు మే గురుమ్॥**
**యేడిద్యన్వయ సద్రత్నం స్థాపత్య విదుషాం వరమ్।**
**సూర్యనారాయణాభిఖ్యం సద్గురుం నౌమి సర్వదా॥**
బిజుమళ్ళ కులాబ్ధీందుం జ్యోతిర్విద్యా విశారదమ్ ।
కీర్తిశాలిన మాచార్యం సూర్యనారాయణం నుమః ॥
వృద్ధం పంచాంగ గణన ప్రజ్ఞా పరిణతం గురుమ్ ।
నిర్మలం నిర్మలావాసం రాజేశ్వర బుధం నుమః ॥
చిఞ్చాపూరి కులోద్భూతం జ్యౌతిషార్ణవ మంథరమ్ ।
సుబ్రహ్మణ్యాఖ్యమమలం పితృతుల్యం గురుం నుమః ॥
స్వీయ విజ్ఞాపనా
యన్నామ వర్ణాంచిత కర్ణరంధ్రా ఆంధ్రా భవంత్యుత్పులకీ కృతాంగాః ।
యద్వంశజా స్సర్వ దిగంతతాంత భ్రాజద్యశ శ్శాలిన ఏవ లోకే ॥
అద్యాపి జీవేదితి తూహ్యమానః యన్మూలభూతః పురుష శ్చకాస్తి ॥
కౌండిన్యగోత్ర ప్రథితో హి సోఽయం వర్వర్తి కుప్పాహ్వయ వంశమౌళిః ।
తజ్జ స్తపస్వీ గ్రహవేదవేత్తా శ్రీ దక్షిణామూర్తి రితీద్యశీలః ॥
తత్పుత్రరత్నం స్పృహణీయశీలః లక్ష్మావధానీ శ్రుతితత్త్వవేత్తా ।
జనార్దనానంద సరస్వతీతి తుర్యాశ్రమే యః ప్రథితః ప్రపంచే ॥
దృష్టాంతభూతస్య నవీనకాలే జీవన్విముక్తే ర్విధితత్పరస్య ।
తస్యోత్పునానస్య గృహస్థ భావం త్రయః ప్రజాతా స్తనయాః పవిత్రాః ॥
తన్మధ్యమో మే జనకో గుణీ సుబ్రహ్మణ్యశాస్త్రీతి సునామధారీ ।
మీనాక్షికా మే జననీ సుసాధ్వీ తయో ర్వయం వై తనుజా స్త్రయ స్మః ॥
తన్మధ్యమోహం గురుమధ్యగామీ శ్రీయాంజనేయ స్సుధియాం విధేయః ।
వంశర్షిమాలా కృపయాత్తవిద్యః కరోమి పంచాంగ మిహాన్వయాప్తమ్ ॥
**శుభాభివృద్ధ్యా అశుభ ప్రశాన్త్యై నృజన్మన స్సార్థకతా ప్రసిద్ధ్యై ।**
**సత్కర్మ కాలస్య వివేక సిద్ధ్యై పంచాంగ మేతత్సుధియాం ముదేఽస్తు॥**

## విషయసూచిక



**విషయా వినివర్తన్తే చిత్తే యద్విషయే సతి ।**
**సమస్త విషయాతీతం బ్రహ్మ తన్మంగళం పరమ్ ॥**

## పంచాంగ పద్ధతి – ముఖ్య గమనిక

**1. ఈ పంచాంగము శ్రీ కేత్కరీయ జ్యోతిర్గణిత దృక్సిద్ధాంత విధానములో గుణించబడినది. ఇందు కాలమానము హైదరాబాదు ప్రాంతమునకు చూపబడినది.**

**2.** పూర్వకాలపు పంచాంగాలలో తిథి వారాదులు, వర్జ్యాలు మొదలైనవన్నీ ఒకే వరుసలో ఉండేవి. గ్రహస్థితి గతులు స్పష్టంగా తెలియుట చాల ఇబ్బందే అయేది. నవీనులు కొందరు ప్రతిదిన చక్రాలు వేస్తున్నారు. ఈ పంచాంగములో ఈ రెండు పద్ధతులను సమ్మేళనం చేసి ప్రతిదిన చక్రాల దగ్గరనే పంచాంగాలలో ఉండవలసిన విశేషాలన్నీ పొందు పరచడమైనది.

**3.** పండుగలు, తిథి పర్వాదుల విషయమున మన దేశమున ప్రసిద్ధములు, శిష్టులందరు ప్రమాణముగ గ్రహించుచున్న నిర్ణయ సింధువు, ధర్మసింధువు, కాలమాధవీయము, కాల నిర్ణయ చంద్రిక మున్నగు గ్రంథములను, మా పూర్వుల / ఇతర ప్రసిద్ధ పూర్వ పంచాంగ కర్తల నిర్ణయములను సరి చూచుకుని, పెద్దలను సంప్రదించి, యథామతి, నిర్ణయించటమైనది. ముఖ్యమైన కొన్ని తిథి పర్వాదుల విషయాలలో నిర్ణయాలకు తగిన ప్రమాణ వాక్యాలు కూడా సంగ్రహంగా తెలుపబడినాయి. ఇట్టి వాటిలో కులాచార/ వర్ణాచార / దేశాచార / ప్రాంతీయ సంప్రదాయ భేదములు ఉంటాయి. ఎవరికి వారు తమ తమ సంప్రదాయమును, తగిన పెద్దల ద్వారా, నిర్ణయించుకుని అనుసరించుటయే న్యాయము. అవసరమును బట్టి పంచాంగ కర్తను కూడ సంప్రదించవచ్చును.

**4. ప్రతిరోజు :** గ్రహస్థితులు ఉదయం 5:30 ని. I.S.T. కి సరిపోవునట్లుగా సవ్యకుండలనీ చక్రములో ఇవ్వబడినవి. (గ్రహములకు ప్రక్కనున్న అంకెలు డిగ్రీలు, నిమిషములు). అలాగే తిథి, నక్షత్ర, యోగ, కరణముల అంతము, అట్లే వర్జ్యము, అమృత ఘడియల ఆద్యంతములు I.S.T. లో ఇవ్వబడినాయి. కనుక ఇవన్నియు భారతదేశమున అన్ని ప్రాంతములకు సరిపోవును. (ఏ మార్పు అవసరము లేదు.)

**5.** కాని, సూర్యోదయా స్తమయములు, లగ్నప్రమాణ, లగ్నాంతములు స్థానిక అక్షాంశ, రేఖాంశములతో ముడిపడియున్న స్థానికాంశములు. వారదుర్ముహూర్త, రాహు/గుళిక/యమకంటక కాలాదులు కూడా స్థానికములే. ఇక – కర్మానుష్ఠానమునకు వలయు తిథి–పర్వాదుల నిర్ణయము I.S.T. పై గాక, స్థానిక సమయాదులపైననే ఆధారపడును. సంధ్యావందనాది నిత్యకర్మలకు సూర్యోదయ కాలీన తిథి, ఆబ్దికాది నైమిత్తికములకు అపరాహ్ణ వ్యాప్తి, అట్లే వివిధ వ్రత పర్వాదులకు అహోరాత్రములందలి నిర్దిష్ట భాగములలో తిథి వ్యాప్తి – కొన్నిటికి నక్షత్రవ్యాప్తి కూడ ప్రధానములు. ఈ వ్యాప్తులన్నియు స్థానిక సూర్యోదయాస్తమయ కాలములను బట్టి మారుచుండును. సన్నిహిత ప్రాంతములలో కూడ – ఈ తిథి పర్వాదులు ఖచ్చితముగ ఒకే రోజున అని అనుట ఏ మాత్రము శాస్త్రీయము కాదు. కనుక వీటిని ఆయా ప్రాంతములకు సరిచూచుకొనుటయే శాస్త్రీయము. తప్పదు.

**6. కాగా – ఈ పంచాంగమున ప్రతిదిన చక్రముల దగ్గర సూచించిన సూర్యోదయ అస్తమయములు, లగ్నాంతములు, వారదుర్ముహూర్తములు** I.S.T. **లో హైదరాబాదు ప్రాంతమునకే సరిపోవును. అట్లే ఇట సూచించిన తిథి పర్వాదుల నిర్ణయములు కూడ హైదరాబాదు ప్రాంతమునకే.**

**7.** కొన్ని ఇతర ప్రాంతములకు సూర్యోదయా స్తమయముల పట్టికలు, లగ్నప్రమాణ లగ్నాంతములకు వలయు సంస్కార పట్టికలు కూడ ఇవ్వబడినాయి. తిథి పర్వాదుల విషయమున ఇతర ప్రాంతములకు వలయు సూచనలు కూడ కొన్ని ఇవ్వబడినాయి.

**8.** ఇట్టి స్థానికాంశములన్నిటిని – ప్రతిరోజు – అన్ని ప్రాంతములకు ఒకే చోటున సూచించుట పాఠకులకు అత్యంతము అసౌకర్యము అయి తీరును. కనుక ఆపని చేయుటలేదు. కనుక ఇతర ప్రాంతములకు వీటిని తగురీతిగ సరిచూచు కొనుచుండుట తప్పదు.

**9.** పూర్వకాలములో పంచాంగములు సామాన్యంగా ఆయా పంచాంగ కర్తల ప్రాంతములకు పరిమితమై ఉండెడివి. కనుక తిథిపర్వాది నిర్ణయములలో సవరణలను సూచించెడి అలవాటు ఉండెడిది కాదు. ప్రస్తుతకాలమున ఒకే పంచాంగము అనేక ప్రాంతములలో ఉపయోగింపబడుచున్నది. కావున విజ్ఞుల ఉపయోగము కొరకై పై సూచనలు అందించబడుచున్నాయి. **అవసరమును బట్టి పండితుల సహాయమున స్థానిక తిథ్యాది పర్వ నిర్ణయములను చేసుకొనవలెను.**

**10. దిన చక్రముల మధ్యలో ఉన్న సంకేతములు :-** తి = తిథి, న = నక్షత్రము, యో = యోగము, క = కరణం, అ.ఘ = అమృత ఘడియలు, దు = దుర్ముహూర్తము, వ = వర్జ్యము, ప = పగలు, రా = రాత్రి, రా.తె = రాబోవు తెల్లవారుజాము.

**11. సత్కర్మానుష్ఠానమునకు వలయు కాలవిశేషములను తెలిసికొనుటయే పంచాంగము యొక్క పరమ ప్రయోజనము.** తదర్థమై సనాతన ధర్మశాస్త్రమునకు, అధునాతన విజ్ఞాన శాస్త్రమునకు రెంటికీ సరి పోవునట్లుగా నిర్ణయములు వచ్చు రీతిలో ఈ పంచాంగము సత్పురుషుల సేవలో సవినయముగా సమర్పించబడుచున్నది.

**సత్కర్మ కాలస్య వివేక సిద్ధ్యై పంచాంగమేతత్సుధియాం ముదేஉస్తు**

**శ్రీరామ**

**శ్రీ కల్యాణ గుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం గంగా స్నాన విశేష పుణ్య ఫలదం గోదాన తుల్యం నృణామ్ ।**
**ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం నానాకర్మ సుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్ ॥**

అస్య శ్రీ సమస్త కల్యాణ భాజనస్య శ్రౌత స్మార్త నిత్య నైమిత్తిక కామ్య కర్మానుష్ఠాన నిదాన భూతస్య స్వస్తి శ్రీ చాంద్రమాన **శార్వరి** నామ సంవత్సరస్య సృష్ట్యాది గత సౌరాబ్దాః 195,58,85,122 కల్యాది గతాబ్దాః 5122, విక్రమార్క శకాబ్దాః 2078, శాలివాహన శకాబ్దాః 1943, క్రీస్తు శకాబ్దాః 2021-2022. **వ్యవహారమానేన –** అథాస్మిన్దేశే లోక వ్యవహారార్థం చాంద్రమానాబ్దో గ్రాహ్యః. వింధ్యస్యోత్తర దేశే బార్హస్పత్యమానాబ్దో గ్రాహ్యః. శేషాచలస్య దక్షిణ దేశే సౌరమానాబ్దో గ్రాహ్యః. చాంద్ర, సౌరమాన వశాదయం **ప్లవ** నామ సంవత్సరః . బార్హస్పత్యమానవశాత్ **ఆనంద** నామ సంవత్సరః. గురూదయ వశాత్ **భాద్రపదాబ్దః. అయనాంశాః** 24°08'56''

## సంవత్సర ఫలితాంశములు

| | | | |
|---|---|---|---|
| ర బు చ | శు | ల కు రా | |
| గు | వర్ష లగ్న | | |
| శ | కుండలి | | |
| | కే | | |

| | | | |
|---|---|---|---|
| బు | ర శు చ | రా | కు |
| గు | జగల్లగ్న | | |
| ల శ | కుండలి | | |
| | కే | | |



### సంవత్సర నాయకాః

| | | | | |
|---|---|---|---|---|
| **01. రాజా కుజః** | **07. మేఘాధిపః కుజః** | 13. గ్రామపాలకః కుజః | 19. పశ్వధిపః కుజః | 25. వృక్షాధిపః గురుః |
| **02. మంత్రీ బుధః** | **08. రసాధిపః రవిః** | 14. దైవజ్ఞః చంద్రః | 20. దేవాధిపః శుక్రః | 26. జంగమాధిపః శుక్రః |
| **03. సేనాధిపః చంద్రః** | **09. నీరసాధిపః శుక్రః** | 15. రాష్ట్రాధిపః కుజః | 21. నరాధిపః చంద్రః | 27. సర్పాధిపః శనిః |
| **04. సస్యాధిపః శుక్రః** | 10. పురోహితః శుక్రః | 16 ఉద్యోగపః బుధః | 22. గ్రామపః గురుః | 28. మృగాధిపః చంద్రః |
| **05. ధాన్యాధిపః గురుః** | 11. పరీక్షకః గురుః | 17. అశ్వాధిపః బుధః | 23. వస్త్రాధిపః రవిః | 29. శుభాధిపః కుజః |
| **06. అర్ఘాధిపః కుజః** | 12. గణకః శనిః | 18. గజాధిపః శుక్రః | 24. రత్నాధిపః కుజః | 30. స్త్రీణామధిపః కుజః |

వీరు సంవత్సర నాయకులు. వీరిలో మొదటి తొమ్మిది మంది ప్రధాన నాయకులు. మిగిలిన వారు ఉపనాయకులు. వీరిని బట్టి ఈ సంవత్సర కాలంలో భారతదేశంలోని ప్రజల మనోవృత్తుల గణనములు, శుభాశుభ విషయములలో ఎట్లు ప్రవర్తించునో తెలియును. ప్రకృతమున ఈ సంవత్సరము 9 మంది ప్రధాన నాయకులలో 5గురు శుభులు. 21 మంది ఉపనాయకులలో 12 మందికి శుభత్వం కలిగినది.

కాగా, ఈ సంవత్సరం కుజునకు రాజ్యాధిపత్యముతో పాటు అర్ఘ మేఘాధిపత్యము రెండును రావటము వలన అన్ని రంగాలలోను నాయకులలోను, అధికారులలోను, ప్రజలలోను పరస్పరము సహకరించు కునే ధోరణి తక్కువగా ఉండే సూచనలున్నాయి. కాగా, ప్రజోపయోగి పథకాల అమలు విషయములో ప్రభుత్వము కఠోరమైన నిర్ణయములను అమలు చేయు లక్షణములు గోచరించుచున్నవి. అలాగే మంత్రిత్వము సౌమ్యుడైన బుధునకు రావడము వల్ల అన్ని రంగాలలోను, ఆర్థిక వ్యూహాలలోను పరస్పర పొంతనలతోను, సమగ్ర సమన్వయముతోను కూడిన ప్రణాళికలు వెలువడును. అలాగే అంతర్జాతీయ స్నేహసంబంధాల వృద్ధి, విదేశీ ఆర్థిక ఋణ సహాయమును అధికముగా తీసుకొని రాగల సూచనలున్నాయి. కాని ఆ లాభములు ప్రజలను చేరులోపల అనేక రంధ్రములు ఏర్పడి కొన్ని చిక్కులు వచ్చును. కాగా, జాతీయం గాను, అంతర్జాతీయంగాను కొన్ని ఒత్తిళ్ళు ఎదుర్కొనప్పటికిని నాయకులు, అధికారులు దృఢసంకల్పంతోనే వ్యవహరిస్తారు. ప్రజా ఉద్యమాలు, కార్మిక ఉద్యమాలు తీవ్రంగా లేచినప్పటికీ వాటి అణచివేత కూడ తీవ్రముగానే ఉండే సూచనలున్నాయి. ఇన్ని గందరగోళాల మధ్యలో కొన్ని దీర్ఘకాలిక శుభ పరిణామాలు ఆశాకిరణాలుగా కనిపిస్తున్నాయి. అంతర్జాతీయ సరిహద్దు తగాదాలలో మన దేశానికి కొన్ని నూతన విజయాలు అందవచ్చు. అలాగే మిగిలిన ఆధిపత్యములను కూడా పరిశీలించగా ఈ సంవత్సరము వర్షాలు కొద్దిగా తక్కువగా కురుస్తాయి. అగ్నిప్రమాదాలు, చోర రోగ భయములు అధికమవుతాయి. ఆహార పదార్థాల ధరలు ఎక్కువగా ఉండి సామాన్యులకు అందుబాటులో ఉండవు. కాగా, సస్య, నీరసాధిపతులు శుభగ్రహాలు అగుటవల్ల మొత్తము మీద వ్యవసాయాభివృద్ధికి మధ్య మధ్య అవాంతరాలు, ఋతుపవనాలు ఆలస్యమగుట, వర్షాభావ పరిస్థితులు, తుఫానులు ఎదురు అయినప్పటికినీ పంటలకు పెద్దగా దెబ్బ తగలక పోవచ్చు. తద్వారా మన విదేశీ వాణిజ్యం పెరిగే సూచనలు ఉండుట ఇత్యాది అంశములను పునాదిగా పెట్టుకొని విచారణ చేయగా–

వర్షలగ్నమును బట్టి రాష్ట్ర ప్రభుత్వం సుస్థిరంగా ఉన్నప్పటికిని స్వపక్షంలో అంతర్గత శత్రువులు, ఉపనాయకుల సహాయ నిరాకరణ చర్యలు వంటి ఇబ్బందులున్నప్పటికిని ప్రభుత్వము ఏకపక్షముగా ముందుకు సాగిపోయే పరిస్థితి కనిపించుచున్నది. కాగా, ప్రజోపయోగ పథకాల అమలులో అధికారుల సమన్వయ లోపము వలన శుభఫలములు అన్నియు ప్రజలకు ఆశించినంతగ అందుబాటులోనికి రావు. అలాగే అకాల విపత్తులను ఎదుర్కొనటంలో ప్రభుత్వ వైఫల్యాల వల్ల సామాన్య ప్రజానీకం ఇక్కట్లు పాలయ్యే సూచనలు ఉన్నాయి. ద్వితీయ స్థానమును పరిశీలించగా నిత్యావసరాల నిర్వహణ ప్రజలకు గతము కంటే కొంత ఎక్కువ భారమైనప్పటికిని వారి సామాన్య స్థితిగతులు వృద్ధి చెందుతాయి. తరచు అకాల

విపత్తులతో, ఊహించని ప్రమాదాలతో సామాన్య ప్రజానీకం ఇక్కట్లు పాలయ్యే సూచనలు కూడా ఉన్నాయి. అయితే రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచే విషయంలో ప్రభుత్వము చేయు ప్రయత్నములు కొంత మెరుగ్గా ఉంటాయి. కుటుంబ వ్యవహారాలలో కొంత అశాంతి ఉన్నప్పటికి సామరస్య ధోరణితో ముందుకు సాగుతారు. అలాగే ప్రజలకు సకాలంలో సరియగు వైద్యమందు విషయములో తీవ్రమైన నిర్లక్ష్యధోరణి పెరుగుతుంది. బ్యాంకింగ్ రంగములో పోటీతత్త్వము పెరిగి ఖాతాదారులకు మరింత మేలైన సేవలను అందించడంలో బ్యాంకులు సఫలమవుతాయి. తృతీయ స్థానమును పరిశీలించగా రాష్ట్ర రవాణా రంగము పెను క్లిష్ట సమస్యలను అధిగమించి పలు ఆకర్షణీయ ప్రజోపయోగ పథకాలతో ప్రజల మన్ననలు అందుకుంటుంది. అలాగే పత్రికా, సమాచార రంగాలలో వినూత్నమైన సంస్కరణలతో ప్రతిభకు తగిన ప్రగతి కనిపించుచున్నది. చతుర్థ స్థానమును పరిశీలించగా వ్యవసాయ రంగములో ప్రకృతి బాధలు, ఈతిబాధలు పెరిగి పంటలు కొంత తగ్గటం, ప్రభుత్వపు ఉదాసీనత, పరిశ్రమాధిపతుల దమన శాసనముల బలముచే రైతులకు గిట్టుబాటు ధర విషయమున గోటిచుట్టపై రోకలిపోటు వలె కనిపించుచున్నది. ఇక విద్యారంగంలో విద్యార్థుల ప్రతిభలు జాతీయ ఖ్యాతినందుతాయి. రియల్ ఎస్టేటు రంగములలో వ్యతిరేక పరిణామములు తక్కువగా గోచరించుచున్నవి. పంచమ స్థానమును పరిశీలించగా శిశుసంక్షేమం, సంగీత, సాహిత్య, పరిశోధనా రంగాలలో ప్రభుత్వ అలసత్వధోరణి ఉన్నప్పటికిని ప్రభుత్వేతర సహకారం, ప్రోత్సాహాలతో కాస్త నిలదొక్కుకుంటాయి. షష్ఠ స్థానమును పరిశీలించగా రాష్ట్రంలో అంటువ్యాధులు పెరుగు అవకాశాలు ఉన్నాయి. సప్తమ స్థానమును పరిశీలించగా రాష్ట్రం కేంద్ర ప్రభుత్వాల మధ్య సయోధ్య తక్కువగా ఉండే అవకాశాలు ఉన్నాయి. కాగా, రాష్ట్ర వాణిజ్య వ్యవహారాలు నిరుడు కంటే కొంత కుంటుబడే అవకాశమున్నది. అలాగే, రాష్ట్రంలో ఆదర్శ వివాహ వ్యవస్థలు కొంత బలహీనపడుతున్న ప్పటికిని కుటుంబ విలువలకు ప్రాధాన్యతలనివ్వటం కొంత శుభ సూచకంగా గోచరిస్తున్నది. ప్రభుత్వరంగ సంస్థలలో రహస్యములు బయట పడుట ద్వారా ప్రభుత్వం కొంత అప్రతిష్ఠ పాలు కావలసివచ్చును. అష్టమ స్థానమును పరిశీలించగా వ్యాధుల నియంత్రణ విషయములో ప్రభుత్వ వైఫల్యము బహిర్గతమగును. నవమస్థానమును పరిశీలించగా వైజ్ఞానిక పరిశోధన విషయాలలో రాష్ట్ర విద్యార్థులు జాతీయ స్థాయి విజయాలను అందుకుంటారు. న్యాయవ్యవస్థ కూడా తన గౌరవమును నిలబెట్టుకొనుటలో సఫలీకృతమవుతుంది. మత సంబంధ, ఆధ్మాత్మికత విషయాలలో పీఠాధిపతుల, మఠాధిపతుల కృషి విశేషంగా ఉండి ఇటు ప్రజలలోను, అటు పాలకులలోను ఆధ్మాత్మికతను, ధర్మానికి కట్టుబడి ఉండే లక్షణములను సూచించుచున్నాయి. దశమ స్థానమును పరిశీలించగా చట్ట విరుద్ధమైన పనులను సమర్థవంతంగా అడ్డుకోవడంలో ప్రభుత్వము కొంతవరకే సఫలమవుతుంది. ఏకాదశ స్థానమును పరిశీలించగా గ్రామీణ, వ్యవసాయరంగాలలో సానుకూల సూచనలధికంగా కనిపిస్తున్నాయి. రైతులు, ప్రభుత్వము కూడా ఆహారధాన్య విషయములలో శ్రద్ధ వహిస్తారు. వాటి ఫలితాలు కూడా ప్రోత్సాహకరంగా ఉంటాయి. అలాగే వివిధ రంగాల ద్వారా రావలసిన ఆదాయం కూడా పెరిగే సూచనలు ఉన్నాయి. ద్వాదశ స్థానమును పరిశీలించగా ఆరోగ్య పథకములు వంటి ప్రజోపయోగ పనులకు తీవ్ర అంతరాయాలు, నష్టం ఏర్పడి సామాన్య జనజీవనానికి అవి అందని ద్రాక్షపళ్ళ వలె క్లిష్టం కావచ్చు. కాగా, ప్రభుత్వం అట్టి వారిని అదుపు చేయటంలో కొంతవరకే విజయం సాధించు సూచనలున్నాయి.

జగల్లగ్నమైన తులను పరిశీలించగా కేంద్ర ప్రభుత్వము చాలా సుస్థిరంగా, ప్రజోపయోగికరముగా ఎంచుకున్న నిర్దేశక సూత్రాలకు అనుగుణముగా వ్యవహరిస్తుంది. అలాగే కేంద్రంలోని పాలకుల సమర్థత వలన అంతర్జాతీయంగా మన దేశఖ్యాతి అంతర్జాతీయముగా గతయేడు కంటే మరింత వృద్ధి చెందుతుంది. ద్వితీయ స్థానమును పరిశీలించగా దేశ ఆర్థికవిధానాలలో ముందుచూపు నిర్ణయాలు, పాలనాయంత్రాంగం సరిగ్గా స్పందించడం, కొన్ని జాతీయ పనులు వెంటనే కార్యరూపం దాల్చడం వంటివి ప్రజల అభివృద్ధికి దోహదం చేస్తాయి. అలాగే విదేశాల ఋణ ఆర్థిక సహాయమును అధికముగా తీసుకురాగల సూచనలున్నవి. అలాగే ఇంటా బయట శత్రువులను ఇనుప పాద ధోరణితో అణచడం, తద్వారా రక్షణ వ్యయం కొంత తగ్గడం, సామాన్యులపై భారం తరగడం వంటి సూచనలు ఉన్నాయి. తృతీయ స్థానమును పరిశీలించగా ఇతర దేశాలతో దౌత్య సంబంధాలు బాగా వృద్ధి చెందినప్పటికి మన దేశానికి మేలు చేసే ఒప్పందాలు కుదుర్చుకొనడంలో అధికారులు విఫలం అయ్యే సూచనలున్నాయి. విప్లవాత్మకమైన మార్పులు చోటు చేసుకున్నప్పటికిని, రాజకీయ తీవ్రత వల్ల ఆశించిన సంస్కరణలు రాకపోవుచ్చును. కాగా, కొన్ని ఆకస్మిక దుర్ఘటనలు జాతీయ రహదారుల అభివృద్ధికి ఆటంకముగా మారుతాయి. చతుర్థ స్థానమును పరిశీలించగా విద్యా రంగములో ప్రగతి కనిపించుచున్నది. వైజ్ఞానికులు భూగర్భ వనరులను, ఖనిజాలను వెలికితీయడంలో నూతన విజయాలు సాధిస్తారు. కాగా, అంతర్జాతీయ స్థాయికి తగిన కృషిని ప్రోత్సహించలేని పరిస్థితి ఏర్పడును. వ్యవసాయ రంగములో సానుకూల సూచనలు అధికంగా కనిపిస్తున్నాయి. గత అనుభవములతో రైతులు, ప్రభుత్వము కూడ ఆహార ధాన్యముల విషయములో శ్రద్ధ వహిస్తారు. ప్రభుత్వము వారి ఆర్థిక సహాయము కొన్ని ప్రాంతముల రైతులకు ఊరట కలిగించవచ్చును. అలాగే, ద్రవ్యోల్బణం పెరిగే సూచనలున్నాయి. పంచమ స్థానమును పరిశీలించగా సంగీత, సాహిత్య, కళారంగాలలో మన దేశ కళాకారులకు, పరిశోధన సంస్థలకు అంతర్జాతీయస్థాయి ఉన్నప్పటికిని ప్రభుత్వ ప్రోత్సాహం కొంత తగ్గవచ్చును. షష్ఠస్థానమును పరిశీలించగా శత్రుదేశముల వెన్ను పోట్లను సమర్ధవంతముగా త్రిప్పికొట్టడం, ఉగ్రవాదులను అణగద్రొక్కు విధానముతో అంతర్జాతీయముగా మన దేశానికి మద్దతు పెరిగే సూచనలు ఉన్నాయి. సప్తమ స్థానమును, తదాధిపత్యములను చూడగా విదేశములతో అనుకూల సంబంధాలను వాణిజ్య పరంగాను, వ్యావహారిక పరంగాను వృద్ధి చేసుకోవటంలో ఈయేడు కూడా కేంద్ర ప్రభుత్వం సమర్థవంతముగా వ్యవహరిస్తుంది. అష్టమ స్థానమును పరిశీలించగా షేర్ మార్కెట్లు, స్పెక్యులేషన్ వ్యవహారాలు, ఆర్థిక వ్యాపారాలలో ప్రోత్సాహకరమైన మార్పు కనిపిస్తున్నది. నవమ స్థానమును పరిశీలించగా దేశంలో ఆధ్యాత్మిక భావాలు, ప్రజలలో దేశభక్తి, జాతీయభావములు బాగా పెరుగుతాయి. అలాగే మఠాధిపతులు, పీఠాధిపతులు ప్రజలలో నైతిక విలువలను, ఆధ్యాత్మిక విలువలను పెంచడంలో విపరీతమైన కృషి దాల్చవచ్చు. నౌకా వ్యాపారములు అభివృద్ధి చెందుటకు అవకాశం కలదు. ఆర్థిక సంస్కరణల విషయాలలో నాయకులు పట్టుదలగా ఉన్నప్పటికిని వాటిలో గల లోపాలను సరిచేయడంలో వారు సమర్థులు కాలేరు. కాగా, కొన్ని క్లిష్ట వ్యవహారాలలో న్యాయవ్యవస్థ మరింత చొరవ తీసుకుని సమస్యల పరిష్కారానికి చురుకుగా వ్యవహరిస్తుంది. దశమ స్థానమును పరిశీలించగా పారిశ్రామిక రంగములో గత ఏడాదికి వలే ఈ ఏడు కూడా పురోగతి కొంత ఎక్కువగానే ఉన్నది. ఏకాదశ స్థానమును పరిశీలించగా ప్రభుత్వము క్రొత్త క్రొత్త ఆకర్షణీయ పథకముల ద్వారా సమృద్ధిగా ఆదాయ వనరులు పెంచుకొనును. అలాగే నిరుద్యోగ తీవ్రత గణనీయముగా తగ్గే అవకాశమున్నది. కాగా, వ్యాపారరంగంలో లాభాలు పొంగి పొరలు చున్నట్లు పైకి కనిపించుచుండంగానే వ్యాపారములు మునిగిపోవు సన్నివేశములు కలుగవచ్చును. ద్వాదశ స్థానమును పరిశీలించగా రాజకీయ, సాంఘిక వత్తిడుల తీవ్రత ఎక్కువైనను, వారిని నియంత్రించే విషయంలో ప్రభుత్వం విజయం సాధిస్తుంది.

మొత్తం మీద ఈ సంవత్సరము రాజకీయ, ఆర్థిక సుస్థిరత విషయములో మాత్రము ముందడుగు కనిపిస్తోంది. ప్రజలు నాయకులు తమకు కలిగిన ఆధ్యాత్మిక దృష్టిని మరింత పెంచుకుని, విశేషముగా **సుబ్రహ్మణ్యోపాసన** అధికంగా చేసి, ఆస్వామి అనుగ్రహముచే ప్రగతిని, సన్మంగళములు పొందుదురు గాక ! శుభమ్ !!

**ఏప్రిల్ 2021**

13: స్వస్తి శ్రీ చాన్ద్రమాన ప్లవ నామ సంవత్సరాదిః, వసంత నవరాత్రారంభః, మేష సంక్రమణం
14: సౌర సంవత్సరాదిః
15: మాస గౌరీ వ్రతారంభః మత్స్యజయన్తీ
16: గణేశదమనపూజా
17: లక్ష్మీపంచమీ
21: సర్వేషాం శ్రీరామనవమీ
22: ధర్మదశమీ
23: సర్వేషాం కామదైకాదశీ
24: వామనద్వాదశీ
25: అనంగత్రయోదశీ
27: మదనపూర్ణిమా
30: సంకష్టహరచతుర్థీ

**మే 2021**

04: శుక్రమౌఢ్య త్యాగః డొల్లు కర్తరీ ప్రారంభః
07: సర్వేషాం వరూథిన్యేకాదశీ
09: మాసశివరాత్రిః
11: నిజకర్తరీ ప్రారంభః
12: వైశాఖస్నానారంభః
14: అక్షయతృతీయా సౌభాగ్య/సంపద్గౌరీ వ్రతం పరశురామజయన్తీ వృషభ సంక్రమణం శ్రీ జనార్దనానన్ద సరస్వతీ స్వామినామారాధనమ్
17: శ్రీశఙ్కరభగవత్పాద జయన్తి
18: గంగావతారః
19: శ్రీవిద్యారణ్య జయన్తీ
22: స్మార్త గృహస్థానాం ఏకాదశ్యుపవాసః
23: పరశురామైకాదశీ పరశురామ ద్వాదశీ
25: సర్వేషాం నరసింహ జయన్తీ
26: సంపద్గౌరీవ్రతం
27: శ్రీకాంచీ పరమాచార్య జయంతి
28: కర్తరీ త్యాగః
29: సంకష్టహరచతుర్థీ

**జూన్ 2021**

03: చండికాపూజా
04: శ్రీ హనుమజ్జయంతి
05: మంజులైకాదశీ
06: సర్వేషామపరైకాదశీ
08: మాసశివరాత్రిః
11: కరవీర వ్రతం
12: బుద్ధ జయన్తీ, కల్కి జయన్తీ
15: మిథున సంక్రమణం ఉపాంగ లలితా వ్రతం
16: వన గౌరీ వ్రతం
18: శుక్లా దేవీ పూజా
20: దశాదిత్యవ్రతం
21: కర్కాటకాయనం ప 09:02 సర్వేషాం నిర్జలైకాదశీ కూర్మజయన్తీ
22: రామలక్ష్మణ ద్వాదశీ
24: బిల్వ త్రిరాత్ర వ్రతం
27: సంకష్టహరచతుర్థీ

**జులై 2021**

02: త్రిలోచనపూజా
05: సర్వేషాం యోగిన్యేకాదశీ
08: మాసశివరాత్రిః
12: శ్రీరామరథోత్సవం
14: స్కన్దపంచమీ
15: స్కన్దషష్ఠీ
16: కర్కాటక సంక్రమణం దక్షిణాయన పుణ్యకాలము ఉదయాది ప 04:55 వరకు
17: మహిషాసురమర్దినీ పూజా
19: (మహా)లక్ష్మీవ్రతారంభః శాకవ్రతారంభః
20: సర్వేషాం శయనైకాదశీ (తొలి ఏకాదశీ) గోపద్మ వ్రతారంభః
21: వాసుదేవ ద్వాదశీ వామన పూజా
23: భార్గవరాకా వ్రతం
24: గురుపూర్ణిమా, యతీనాం చాతుర్మాస్యారంభః
27: సంకష్టహర చతుర్థీ

**ఆగష్టు 2021**

04: సర్వేషాం పవిత్రైకాదశీ కామదైకాదశీ
06: మాసశివరాత్రిః
09: శివనక్తవ్రతారంభః
10: మంగళగౌరీవ్రతారంభః
11: స్వర్ణ గౌరీ వ్రతం
12: నాగ చతుర్థీ దూర్వాగణపతి వ్రతం
13: నాగ, గరుడ పంచములు
14: సూర్యషష్ఠీ
15: స్వాతంత్ర్య దినోత్సవం
16: సింహ సంక్రమణం కౌమారీపూజా
17: దధివ్రతారంభః
18: సర్వేషాం పుత్రదైకాదశీ
19: దామోదరద్వాదశీ
20: వరలక్ష్మీ వ్రతం
21: బహ్వృచా ముపాకర్మ
22: సర్వ యజుశ్శాఖినాం, ఆథర్వణికానాం చ ఉపాకర్మ, రక్షాబన్ధనం
25: ప్రధాన సంకష్టహర చతుర్థీ
30: శ్రీకృష్ణ జన్మాష్టమీ,జయన్తీ

**సెప్టెంబరు 2021**

03: సర్వేషాం అజైకాదశీ
05: మాసశివరాత్రిః
06: అమాసోమవార వ్రతం
07: మహత్తమవ్రతం
08: బలరామ జయన్తీ
09: హరితాలికావ్రతం
10: వరసిద్ధి వినాయక వ్రతం
11: ఋషి పంచమీ వ్రతం
12: సూర్య షష్ఠీ, పాపహర షష్ఠీ
13: (అ)ముక్తాభరణ సప్తమీ మహాలక్ష్మీ వ్రతారంభః
14: నన్దానవమీ, కేదారనవమీ,
15: గజలక్ష్మీవ్రతం
16: కన్యా సంక్రమణం క్షీరవ్రతారంభః, దశావ్రతం
17: సర్వేషాం పరివర్తనైకాదశీ వామనజయంతి
19: అనన్తపద్మనాభ వ్రతం
20: యతి చాతుర్మాస్య వ్రత సమాప్తి
21: మహాలయపక్షారంభః
23: ఉండ్రాళ్ళ తద్దె, కజ్జలీవ్రతం
24: సంకష్టహరచతుర్థీ

**అక్టోబరు 2021**

02: సర్వేషాం ఇన్దిరైకాదశీ
03: ఉపేంద్ర ద్వాదశీ
04: మాసశివ రాత్రిః
06: మహాలయామావాస్యా
07: శరన్నవరాత్రారంభః
10: ఉపాంగ లలితావ్రతం
11: బిల్వాభిమన్త్రణం, పుస్తకరూప సరస్వతీ పూజ
12: దేవీత్రిరాత్ర వ్రతారంభః
13: దుర్గాష్టమీ, ఆయుధపూజా
14: మహానవమీ, పుస్తకరూప సరస్వత్యుద్వాసనం
15: విజయదశమీ, శమీపూజా దేవ్యుద్వాసనమ్
16: సర్వేషాం విజయైకాదశీ గోపద్మ, తులసీ, రంగవల్లీ గోద్వాదశీవ్రతారంభములు
17: తులా సంక్రమణం
19: కోజాగరీ వ్రతం
23: అట్లతద్దె
24: సంకష్టహర చతుర్థీ
28: శ్రీశ్రీశ్రీ జనార్దనానంద సరస్వతీ స్వామి జయన్తీ

**నవంబరు 2021**

01: సర్వేషాం రమైకాదశీ గోవత్సద్వాదశీ
02: గో త్రిరాత్ర వ్రతారంభః
03: మాసశివరాత్రిః
04: నరకచతుర్దశీ, దీపావళిః కేదారవ్రతం, లక్ష్మీపూజా
05: కార్తికస్నానారంభః నక్తవ్రతారంభః, గోవర్ధన పూజా, ఆకాశదీపారంభః
06: భగినీహస్త భోజనం
08: నాగచతుర్థీ (వల్మీకపూజా) దూర్వాగణపతి వ్రతం
09: నాగపంచమీ, స్కందషష్ఠీ
11: యాజ్ఞవల్క్య జయంతి, కార్తవీర్య జయంతి
12: అక్షయనవమి
14: మంజులైకాదశీ
15: సర్వేషాం బోధనైకాదశీ
16: వృశ్చిక సంక్రమణం చిలుకు ద్వాదశీ
17: వైకుంఠచతుర్దశీ
18: కార్తికవ్రతోద్యాపనం జ్వాలాతోరణం
19: మహాకార్తికీ
23: సంకష్టహరచతుర్థీ
27: కాలభైరవాష్టమీ
30: సర్వేషాం ఉత్పన్నైకాదశీ

**డిశంబరు 2021**

02: మాసశివరాత్రిః
07: వరచతుర్థీ
08: నాగ పంచమీ
09: సుబ్రహ్మణ్య షష్ఠి
10: మిత్రసప్తమీ, నందాసప్తమీ
12: నన్దినీనవమీ
14: సర్వేషాం మోక్షదైకాదశీ, గీతా జయంతి
15: ధనుస్సంక్రమణం, మత్స్య ద్వాదశీ, వాసుదేవద్వాదశీ
16: ధనుర్మాసారంభః హనుమద్వ్రతం
18: దత్తాత్రేయజయన్తీ
21: మకరాయణం
22: సంకష్టహర చతుర్థీ
27: ప్రధాన అనఘాష్టమీ
30: సర్వేషాం సఫలైకాదశీ ఏకాదశీ గురువార వ్రతం, శ్రీశ్రీశ్రీ చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ స్వామ్యారాధనం

**జనవరి 2022**

01: మాసశివరాత్రిః
03: శుక్రమౌఢ్యారంభః
13: భోగి, వైకుంఠైకాదశీ ఏకాదశీ గురువారవ్రతం
14: మకరసంక్రమణం (ఉత్తరాయణ పుణ్యకాలం) కూర్మ ద్వాదశీ, శుక్రమౌఢ్య త్యాగః
21: సంకష్టహర చతుర్థీ
22: శ్రీత్యాగరాజస్వామ్యారాధన
28: సర్వేషాం షట్తిలైకాదశీ
30: మాసశివరాత్రిః
31: ఆరటన్తీ చతుర్దశీ, అమాసోమవతీ వ్రతం

**ఫిబ్రవరి 2022**

02: మాఘస్నానారంభః
05: శ్రీపంచమీ
07: రథసప్తమి
08: భీష్మాష్టమి
10: నందినీ దేవీపూజా
12: కుంభ సంక్రమణం సర్వేషాం భీష్మైకాదశీ, భీష్మపంచక వ్రతారంభః
13: భీష్మ, వరాహ ద్వాదశులు
19: గురుమౌఢ్యారంభః
20: సంకష్టహర చతుర్థీ
27: సర్వేషాం విజయైకాదశీ
28: శ్రీశ్రీశ్రీ శంకర విజయేంద్ర సరస్వతీ స్వామి వారి జయంతి

**మార్చి 2022**

01: మాసశివరాత్రిః, మహాశివరాత్రిః
14: మీన సంక్రమణం సర్వేషామమలైకాదశీ
15: శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారి ఆరాధన ఆమలక ద్వాదశీ
17: హోళికోత్సవః
19: గురుమౌఢ్యత్యాగః
21: సంకష్టహరచతుర్థీ
28: పాప విమోచన్యేకాదశీ
30: మాసశివరాత్రిః

**ఏప్రిల్ 2022**

02 స్వస్తి శ్రీ శుభకృన్నామ సంవత్సరాదిః

## వైష్ణవ తిరునక్షత్రములు

### మేష మాసము

| | | |
|---|---|---|
| కృత్తిక | ఉయ్యక్కొండార్ | 15-04-21 |
| ఆర్ద్ర | ఎంబెరు మానార్ | 18-04-21 |
| పునర్వసు | చక్రవర్తి తిరుమానార్ | 19-04-21 |
| పునర్వసు | ముదలియాండాన్ | 19-04-21 |
| హస్త | తేవప్పెరుమాళ్ | 25-04-21 |
| హస్త | కిడాంబియాచార్ | 25-04-21 |
| చిత్ర | మధురకవి యాళ్వార్ | 26-04-21 |
| చిత్ర | ఆనందాళ్వార్ | 26-04-21 |
| స్వాతి | పెరియనంబి | 27-04-21 |
| రేవతి | పెరియ పెరుమాళ్ | 09-05-21 |
| అశ్విని | వటుకనంబి | 10-05-21 |

### వృషభ మాసము

| | | |
|---|---|---|
| హస్త | దేవిప్పెరుమాళ్ | 23-05-21 |
| స్వాతి | హళయంగర్ | 25-05-21 |
| స్వాతి | పెరియతిరుమలై నంబి | 25-05-21 |
| విశాఖ | నమ్మాళ్వార్ | 25-05-21 |
| విశాఖ | పిళ్ళై తిరుమలై నంబి | 25-05-21 |
| విశాఖ | తిరువాయ్ మెళి పిళ్ళై | 25-05-21 |
| అనూరాధ | పరాశరభట్టర్ | 26-05-21 |
| అనూరాధ | శ్రీరామ పిళ్ళై | 26-05-21 |
| అనూరాధ | కొయిల్ కందాడై అణ్ణన్ | 26-05-21 |
| జ్యేష్ఠ | తిరువరంగ పెరుమాళ్ | 27-05-21 |
| రోహిణి | తిరుక్కోటి యార్నంబి | 10-06-21 |

### మిథున మాసము

| | | |
|---|---|---|
| ఆశ్రేష | మారనేర నంబి | 15-06-21 |
| స్వాతి | పెరియాళ్వార్ | 21-06-21 |
| స్వాతి | నడక్కుత్తిరువీధి పిళ్ళై | 21-06-21 |
| స్వాతి | తిరువరంగ పెరుమానార్ | 21-06-21 |
| అనూరాధ | నాధమునిగళ్ | 23-06-21 |
| మూల | తిరుయాళ్వార్ | 25-06-21 |
| మూల | కందాడై కోషప్ప | 25-06-21 |

### కర్కాటక మాసము

| | | |
|---|---|---|
| ఉత్తరాషాఢ | ఆళవందార్ | 24-07-21 |
| ఉత్తరాషాఢ | పుండరీకాక్ష | 24-07-21 |
| శ్రవణం | తీర్కాళ్వార్ | 25-07-21 |
| పుష్యమి | ప్రతివాది భయంకరం అణ్ణన్ | 08-08-21 |
| పూ.ఫల్గుని | చూడి కుడుత్త నాంచార్ | 11-08-21 |
| పూ.ఫల్గుని | శ్రీయాండాళ్ | 11-08-21 |
| పూ.ఫల్గుని | కందాడై శోషప్ప | 11-08-21 |
| పూ.ఫల్గుని | యదుగిరి నాచ్చియార్ | 11-08-21 |
| హస్త | బదరీనారాయణ పెరుమానార్ | 13-08-21 |

### సింహ మాసము

| | | |
|---|---|---|
| రోహిణి | శ్రీ కణ్ణ పిరాన్ | 31-08-21 |
| రోహిణి | పెరియనాచ్చారి ప్పిళ్ళై | 31-08-21 |
| రోహిణి | నాయనారచ్చం పిళ్ళై | 31-08-21 |
| మృగశిర | పరవస్తు భట్టర్ పిరాన్ | 01-09-21 |
| మృగశిర | తిరుక్కురుగైప్పిరాచ్ పిళ్ళన్ | 01-09-21 |

### కన్యా మాసము

| | | |
|---|---|---|
| శ్రవణం | వేదాంత దేశికర్ | 17-09-21 |
| శ్రవణం | తిరువేంగడత్తాన్ | 17-09-21 |
| విశాఖ | తిరుమలై నంబి | 09-10-21 |

### తులా మాసము

| | | |
|---|---|---|
| ఉత్తరాభాద్ర | విళాంజోలై పిళ్ళై | 19-10-21 |
| రేవతి | ఎఱుమ్బి అప్పా | 20-10-21 |
| కృత్తిక | కూపకులోత్తమ దాసర్ | 23-10-21 |
| ఆర్ద్ర | కూర కులోత్తమ దాసర్ | 26-10-21 |
| మూల | మణవాళ మహాముని | 08-11-21 |
| మూల | పెరియ జీయర్ | 08-11-21 |
| పూర్వాషాఢ | గురువ ఇప్పిరాన్ | 09-11-21 |
| పూర్వాషాఢ | శేనై ముదలియార్ | 09-11-21 |
| ఉత్తరాషాఢ | వేలాంజీ వైయప్పర్ | 10-11-21 |
| శ్రవణం | పొయిఘ యాళ్వార్ | 11-11-21 |
| శ్రవణం | పిళ్ళై లోకాచార్య | 11-11-21 |
| ధనిష్ఠ | పూధత్తాళ్వార్ | 12-11-21 |
| ధనిష్ఠ | తిరుమలైయాండార్ | 12-11-21 |
| ధనిష్ఠ | నడువిల్ తిరువీధి పిళ్ళై భట్టర్ | 12-11-21 |
| శతభిషం | పేరియాళ్వార్ | 13-11-21 |
| శతభిషం | పిన్బంగియ పెరుమాళ్ జీయర్ | 13-11-21 |

### వృశ్చిక మాసము

| | | |
|---|---|---|
| భరణి | ఈయుణ్ణి మాధవప్పెరుమాళ్ | 18-11-21 |
| భరణి | ఆరుళాళప్పెరుమాళెంబెరుమానార్ | 18-11-21 |
| కృత్తిక | తిరుమంగ యాళ్వార్ | 19-11-21 |
| కృత్తిక | నంబిళ్ళై | 19-11-21 |
| రోహిణి | తిరుప్పాణి యాళ్వార్ | 20-11-21 |
| అనూరాధ | కోటికన్యాదానం తాతాచార్యర్ | 04-12-21 |

### ధనుర్మాసము

| | | |
|---|---|---|
| పునర్వసు | తిరుమలై యాండార్ | 21-12-21 |
| అనూరాధ | నాలూచాన్ | 31-12-22 |
| జ్యేష్ఠ | నాలూరాచ్చాన్ పిళ్ళై | 01-01-22 |
| జ్యేష్ఠ | తొండర డిప్పొడి | 01-01-22 |
| జ్యేష్ఠ | పెరియనంబి | 01-01-22 |
| జ్యేష్ఠ | అళగియ మణవాళప్పెరుమాళ్ | 01-01-22 |

### మకర మాసము

| | | |
|---|---|---|
| మృగశిర | కోవులూన్ ఎంబర్‌మానార్ | 15-01-22 |
| పునర్వసు | ఎంబార్ | 17-01-22 |
| మఘ | తిరుమడి శైయ్యాళ్వార్ | 21-01-22 |
| హస్త | కూరత్తాళ్వార్ | 24-02-22 |
| విశాఖ | గురు కావలప్పన్ | 27-02-22 |
| పూర్వాభాద్ర | నాలూరాచ్చాన్ పిళ్ళై | 04-02-22 |
| పూర్వాభాద్ర | శొట్టైనంబి | 04-02-22 |

### కుంభ మాసము

| | | |
|---|---|---|
| పునర్వసు | కులశేఖరాళ్వార్ | 14-02-22 |
| పునర్వసు | తిరుమలైయాండాల్ | 14-02-22 |
| ఆశ్రేష | పిళ్ళై యురంగావిల్లి దాసర్ | 16-02-22 |
| ఆశ్రేష | తిరుమలై యాండాళ్ | 16-02-22 |
| మఘ | మరణం గాల్నంబి | 17-02-22 |
| మఘ | మణక్కాల్ నంబి | 17-02-22 |
| అశ్విని | శిరియ గోవింద ప్పెరుమాళ్ | 06-03-22 |
| రోహిణి | నంబెరుమాళ్ | 10-03-22 |
| మృగశిర | తిరుక్కచ్చి నంబి | 10-03-22 |

### మీన మాసము

| | | |
|---|---|---|
| శ్రవణం | పెరియ జీయర్ | 28-03-22 |
| రేవతి | పెరియ పెరుమాళ్ | 02-04-22 |

**-: గమనిక :-**

కొన్ని తిరు నక్షత్రములు మతాంతరములను బట్టి మరల ఇవ్వబడినాయి.

## మాధ్వ పుణ్యదినములు

| | | |
|---|---|---|
| శ్రీ వేదవ్యాస తీర్థ | చైత్ర శుక్ల ద్వితీయ | 14-04-21 |
| సత్య ప్రజ్ఞ తీర్థ | చైత్ర శుక్ల ద్వితీయ | 14-04-21 |
| సత్య ధ్యాన తీర్థ | చైత్ర శుక్ల అష్టమి | 20-04-21 |
| కవీన్ద్ర ముని | చైత్ర శుక్ల నవమి | 21-04-21 |
| సత్యప్రియ ముని | చైత్ర శుక్ల త్రయోదశి | 25-04-21 |
| వాగీశ తీర్థ | చైత్ర కృష్ణ తృతీయ | 29-04-21 |
| సత్య విజయ తీర్థ | చైత్ర కృష్ణ దశమి | 06-05-21 |
| సత్య విజయ ముని | చైత్ర కృష్ణ ఏకాదశి | 07-05-21 |
| సత్య విజయ తీర్థ | చైత్ర కృష్ణ త్రయోదశి | 09-05-21 |
| సత్యానన్ద తీర్థ | వైశాఖ శుక్ల ప్రతిపత్ | 24-04-21 |
| విద్యాధిరాజ తీర్థ | వైశాఖ శుక్ల తృతీయ | 14-05-21 |
| రామచన్ద్ర ముని | వైశాఖ శుక్ల షష్ఠి | 18-05-21 |
| సత్యసన్ధ ముని | జ్యేష్ఠ శుక్ల ద్వితీయ | 12-06-21 |
| సత్యాభినవ తీర్థ | జ్యేష్ఠ శుక్ల చతుర్దశి | 23-06-21 |
| పాదరాజ తీర్థ | జ్యేష్ఠ శుక్ల పూర్ణిమ | 24-06-21 |
| కృష్ణద్వైపాయన | జ్యేష్ఠ కృష్ణ ప్రతిపత్ | 25-06-21 |
| సత్యపూర్ణ ముని | జ్యేష్ఠ కృష్ణ ద్వితీయ | 26-06-21 |
| రఘువర తీర్థ | జ్యేష్ఠ కృష్ణ తృతీయ | 27-06-21 |
| సత్యధీర | జ్యేష్ఠ కృష్ణ నవమి | 03-07-21 |
| విద్యాపతి | జ్యేష్ఠ కృష్ణ ఏకాదశి | 05-07-21 |
| విజయీంద్ర తీర్థ | జ్యేష్ఠ కృష్ణ త్రయోదశి | 07-07-21 |
| సత్యాధిరాజ తీర్థ | ఆషాఢ శుక్ల నవమి | 18-07-21 |
| సత్యసంకల్ప తీర్థ | ఆషాఢ శుక్ల పూర్ణిమ | 24-07-21 |
| జయ తీర్థ ముని | ఆషాఢ కృష్ణ పంచమి | 28-07-21 |
| సత్యాధీశ ముని | ఆషాఢ కృష్ణ అమావాస్య | 08-08-21 |
| సత్యవర తీర్థ | శ్రావణ శుక్ల సప్తమి | 15-08-21 |
| రాఘవేన్ద్రముని | శ్రావణ కృష్ణ ద్వితీయ | 24-08-21 |
| సత్యధర్మ తీర్థ | శ్రావణ కృష్ణ త్రయోదశి | 05-09-21 |
| సత్యేష్టకామ | భాద్రపద శుక్ల దశమి | 16-09-21 |
| సత్యేష్ట తీర్థ | భాద్రపద శుక్ల ఏకాదశి | 17-09-21 |
| శ్రీనివాస తీర్థ | భాద్రపద కృష్ణ ద్వితీయ | 22-09-21 |
| మాధవ తీర్థ | భాద్రపద కృష్ణ అమావాస్య | 06-10-21 |
| మాధవ తీర్థ | ఆశ్వయుజ శుక్ల ప్రతిపత్ | 07-10-21 |
| సత్య పరాయణ తీర్థ | ఆశ్వయుజ శుక్ల సప్తమి | 12-10-21 |
| విష్ణు తీర్థ | ఆశ్వయుజ శుక్ల ఏకాదశి | 16-10-21 |
| సత్యప్రమోద తీర్థ | కార్తిక శుక్ల తృతీయ | 07-11-21 |
| వేదనిధి ముని | కార్తిక శుక్ల ఏకాదశి | 15-11-21 |
| విద్యానిధి | కార్తిక కృష్ణ చతుర్థి | 23-11-21 |
| పద్మనాభ తీర్థ | కార్తిక కృష్ణ చతుర్దశి | 03-12-21 |
| రఘువీర తీర్థ | మార్గశిర శుక్ల తృతీయ | 06-12-21 |
| సత్యనిధి ముని | మార్గశిర శుక్ల దశమి | 13-12-21 |
| సత్యనాథ ముని | మార్గశిర శుక్ల ఏకాదశి | 14-12-21 |
| అక్షోభ్య ముని | మార్గశిర కృష్ణ పంచమి | 24-12-21 |
| రఘునాథముని | మార్గశిర కృష్ణ ఏకాదశి | 30-12-21 |
| రఘూత్తమ ముని | పుష్య శుక్ల ఏకాదశి | 13-01-22 |
| సత్యకామ తీర్థ | పుష్య కృష్ణ షష్ఠి | 24-01-22 |
| నరహరి తీర్థ | పుష్య కృష్ణ సప్తమి | 25-01-22 |
| సత్యాభిజ్ఞ తీర్థ | పుష్య కృష్ణ అష్టమి | 25-01-22 |
| పురందర దాస తీర్థ | పుష్య కృష్ణ అష్టమి | 25-01-22 |
| విద్యాధీశ ముని | పుష్య కృష్ణ చతుర్దశి | 31-01-22 |
| పురందరదాస తీర్థ | పుష్య కృష్ణ అమావాస్య | 01-02-22 |
| శ్రీమదానన్ద తీర్థ | మాఘ శుక్ల నవమి | 10-02-22 |
| నంద ముని | మాఘ శుక్ల నవమి | 10-02-22 |
| సత్యజ్ఞాన తీర్థ | మాఘ శుక్ల ఏకాదశి | 12-02-22 |
| రామానంద తీర్థ | మాఘ కృష్ణ నవమి | 25-02-22 |
| సత్య బోధ తీర్థ | ఫాల్గున శుక్ల ద్వితీయ | 04-03-22 |
| వాదిరాజ తీర్థ | ఫాల్గున శుక్ల తృతీయ | 05-03-22 |
| వ్యాసరాయ తీర్థ | ఫాల్గున శుక్ల చతుర్థి | 06-03-22 |
| సత్యవ్రత మునీంద్ర | ఫాల్గున శుక్ల షష్ఠి | 08-03-22 |
| సత్యబోధ తీర్థ | ఫాల్గున కృష్ణ ద్వితీయ | 20-03-22 |
| సత్య సంతుష్ట తీర్థ | ఫాల్గున కృష్ణ అమావాస్య | 01-04-22 |

**గమనిక :-** కొన్ని పుణ్యతిథులు మతాంతరములను బట్టి మరల ఇవ్వబడినాయి.

## శ్రీ ప్లవ సంవత్సర దేవతా ధ్యానమ్

అగ్నిం నమామి సతతం జ్వాలామాలం తమోపహమ్।
అజారూఢం చతుర్హస్తం ద్విశీర్షం ప్లవసంజ్ఞికమ్ ॥

## అబ్దత్రయఫలం

**చాంద్రసౌరమానాభ్యాం ప్లవ సంవత్సర ఫలమ్ :– మేదినీ జల సంపూర్ణా సుభిక్ష ధన ధాన్యధా । క్రిమి బాధా కులం సస్యం ప్లవాబ్దే వైరిణః ప్రజాః ॥** ॥తా॥ స్వస్తి శ్రీ ప్లవ నామ సంవత్సరమున ప్రజలకు ధన ధాన్యములు సమృద్ధిగా సమకూరును. అంతటా నీటి లభ్యత సమృద్ధిగా నుండును. పంటలకు పురుగులబాధ ఎక్కువగా ఉండగలదు. ప్రజలలో ఐక్యత తక్కువగా ఉండి ఘర్షణలు ఎక్కువగా నుండగలవు.

**బార్హస్పత్యమానేన ఆనంద నామ సంవత్సర ఫలమ్ :–** ఆనందాబ్దేఖిలా లోకాః సర్వదానందచేతనః । రాజాన స్సుఖిన స్సర్వే బహు సస్యార్ఘ వృష్టయః **॥తా॥** ఆనంద సంవత్సరమున ప్రాణులందరూ ఆనందముతో వసింతురు. రాజులు, నాయకులు అందరూ కూడా సుఖముగా ఉందురు. అన్నికాల పంటలు కూడా బాగా పండి యోగ్యమైన ధరలు లభించగలవు.

**గురూదయవశ ఫలమ్ :–** వత్సరాది నుండి ఫాల్గున శుక్ల పూర్ణిమ వరకు "శ్రావణాబ్దే ధరా భాతి త్రిదశ స్పర్ధి మానవైః । మనసాభీష్ట వృష్ట్యర్ఘ సస్య పుష్ప ఫలాదిభిః ॥" శ్రావణాబ్దమున సువృష్టి, పాడిపంటల, ఫల, పుష్ప సమృద్ధితో ప్రజలు సుఖముగ నుందురు. తదాది వత్సర పర్యన్తం "అబ్దే భాద్రపదే వృష్టిః క్షేమారోగ్యే క్వచిత్ క్వచిత్। పూర్వ సస్య సమృద్ధి స్స్యా న్నాశంయాత్యపరం ఫలమ్ ॥" భాద్రపదాబ్దమున మంచి వర్షములు కురియును. అందరును ఆరోగ్యముతో క్షేమముగా నుందురు. తొలకరి పంటలు బాగా పండును. మలి పంటలు దెబ్బతినగలవు.

**రాజ్ఞః కుజస్య ఫలం :–** అగ్ని తస్కర రోగాస్యు ర్నృపవిగ్రహతా భృశమ్। హత సస్యో బహువ్యాళో భౌమే వర్షాధిపే సతి **॥తా॥** కుజుడు రాజగుట వలన నాయకులలో ఐక్యత తక్కువగా ఉంటుంది. అగ్నిభయము అధికముగా ఉంటుంది. చోరభయము, రోగభయము, సర్పభయము అధికమవుతాయి. వర్షములు తక్కువగా ఉంటాయి. పంటలు తక్కువగా ఉంటాయి. ఆహార పదార్థాల ధరలు ఎక్కువగా ఉండి సామాన్యులకు అందుబాటులో ఉండవు.

**మంత్రిణః బుధస్య ఫలం :–** వాయునా పీడితా మేఘా స్సర్వే పాపరతా నరాః। సోమ పుత్రస్య మంత్రిత్వే జాయతే మధ్యమం ఫలమ్ **॥తా॥** బుధుడు మంత్రిగ నుండినచో మబ్బులు వాయువుచే ఎగరగొట్టబడి వర్షాలు తక్కువగా కురుస్తాయి. ప్రజలు పాపకర్మలు ఎక్కువగా చేస్తారు. పంటలు మధ్యమముగా పండుతాయి.

**సేనాధిపతేః చంద్రస్య ఫలం :–** అతివర్ష మతి వార్ఘ మరోగా స్సుఖినో జనాః। బహుక్షీరప్రదా గావః చంద్రే సేనాధిపేసతి **॥తా॥** చంద్రుడు సేనాధిపతి అగుట వలన వర్షములు బాగా కురుస్తాయి. ధరలు బాగా పెరుగుతాయి. ప్రజలు ఆరోగ్యంతో సుఖముగా ఉంటారు. ఆవులు సమృద్ధిగా పాలిస్తాయి.

**సస్యాధిపతేః శుక్రస్య ఫలం :–** జలధాన్యాని సర్వాణి స్థలధాన్యాని యాని చ। పాణ్డు భూమిస్తు ఫలితా శుక్రే సస్యాధిపేసతి **॥తా॥** శుక్రుడు సస్యాధిపతి అగుటచే మాగాణిపంటలు, మెట్టపంటలు సమృద్ధిగా ఫలించును. తెలుపు వర్ణపు భూములు బాగా ఫలవంతములగును. అంతటా సువృష్టి ఉంటుంది.

**ధాన్యాధిపతేః గురు ఫలం:–** సువృష్టి స్సర్వదేశానాం సర్వసస్య సమృద్ధయః । భవంతి గావ స్సుదుఘాః గురౌ ధాన్యాధిపే సతి **॥తా॥** ధాన్యాధిపతి గురువైనందున అన్ని దేశములందును మంచి వానలుండి అన్ని పంటలు సమృద్ధిగా నుండును. పాడి కూడ చక్కగా నుండును.

**అర్ఘాధిపతేః కుజస్య ఫలం:–** భౌమే చార్ఘపతౌ స్వల్ప వృష్టి ర్వాయు సమన్వితా। క్వచి ద్వృష్టిః క్వచిద్ధాన్యం ప్రజారోగ్యం క్వచిత్క్వచిత్ **॥తా॥** కుజుడు అర్ఘాధిపతి అగుట వలన మేఘములు వాయువుతో కూడి వర్షములు స్వల్పముగా ఉండును. అక్కడక్కడ వర్షములు కురియును. పంటలు, ఆరోగ్యములు సామాన్యముగా ఉండును.

**మేఘాధిపతేః కుజస్య ఫలం :–** మహావాయు రనర్ఘం చ స్వల్పవర్షం తథా భువి। రక్తసస్యాని జాయంతే భౌమే మేఘాధిపేసతి **॥తా॥** మేఘాధిపుడు కుజుడు అగుట వలన గాలి యధికమగును. వెలలు తగ్గును. వర్షము స్వల్పముగా కురుస్తుంది. ఎర్రని ధాన్యములు ఎక్కువగా ఫలించును.

**రసాధిపతేః రవేః ఫలం :–** ఘృత తైల గుడ క్షౌద్రా యే చాన్యే రస జాతయః। శూన్యార్ఘం యాంతి తే సర్వే రవౌ యది రసాధిపే **॥తా॥** రవి రస నాయకుడు అగుట వలన నెయ్యి, నూనెలు, బెల్లము, తేనె మొదలగు రసజాతులకు ధరలు తగ్గును.

**నీరసాధిపతేః శుక్రస్య ఫలం :–** కర్పూరాగరు గంధానాం హేమ మౌక్తిక వాససాం। వృద్ధయోర్ఘేణ జాయంతే శుక్రే నీరస నాయకే **॥తా॥** శుక్రుడు నీరసాధిపతియైన కర్పూరము, అగరు, మంచి గంధము, బంగారము, ముత్యము, వస్త్రములకు వెలలధికమగును.

**పురోహితాదిఫలం:–** క్రూరగ్రహఫలం క్రూరం శుభగ్రహఫలం శుభమ్। పురోహితాది సర్వేషాం భవేదీశ సముద్భవమ్ **॥తా॥** పురోహితాదులు క్రూర గ్రహములయిన క్రూరఫలమును, శుభ గ్రహములయిన శుభఫలము నిత్తురు.

**పశుపాలకః యమ స్తత్ఫలం :–** అనర్ఘ మల్పవృష్టిశ్చ స్వల్పక్షీరం తథా తృణం। పశుపీడా భవేన్నిత్యం యమశ్చేత్పశునాయకే **॥తా॥** యముడు పశు నాయకుడు అగుట వలన ధరలు తగ్గును. వర్షములు తక్కువగా కురియును. పశునాశము ఎక్కువ అగును. గడ్డి, పాల ఉత్పత్తి తగ్గును.

**ఆఢకాది నిర్ణయః, ఫలం చ :–** అస్మిన్వర్షే ద్వ్యాఢక పరిమితం వర్షం. "మధ్య వృష్టి ర్ద్విరాఢకే" 2 కుంచముల వర్షము. "షష్ఠి యోజన విస్తీర్ణం శతయోజన మున్నతమ్। ఆఢకస్య ప్రమాణం తు దేవమానేన గణ్యతే ॥ దశభాగా స్సముద్రేషు భూధరేషు చ సప్త చ । ద్వౌ భాగౌ భువి పర్జన్య శ్చైవం వర్షతి చ త్రిధా" సముద్రములలో 10, పర్వతములపై 7, భూమిపై 2 భాగములు వర్షించును.

**మేఘాది నిర్ణయః ఫలం :–** ఈ వత్సరమున ఊర్ధ్వదిశలో **ఆవర్త** ః అను మేఘము. "సుమేరో రూర్ధ్వదిగ్భాగే త్వావర్తాఖ్యః ప్రజాయతే । సువృష్టిః పూర్వ సస్యర్ధి స్సేంద్రచాపౌ సగర్జితా" ఆవర్తుడు మేఘుడు అగుట వలన అంతటా ఇంద్రధనస్సులతోను, మేఘ గర్జనలతోను కూడిన వర్షములు ఉండును. ఊర్ధ్వదిశలో మేఘోత్పత్తి. నిరంతర సువృష్టి ఉండును. చతుర్మేఘపక్షములో **ఆవహ** నామకో వాయుః. "ఆవహే చోత్తమా వృష్టిః" మంచి వర్షములు కురుస్తాయి. **చపలా** నామ్నీ విద్యుత్. ''చపలాయాం వాయు పీడా'' అంతాటా గాలిచే మేఘాలు ఎగరగొట్టబడును. **అసిత** నామకం గర్జితం. "అసితే చోత్తమా వృష్టిః" వర్షములు

బాగా కురియును. **క్షీర** నామక స్సముద్రః. "క్షీర స్త్వనల ఏవ చ" వాతావరణము ఉష్ణపూరితముగా ఉండును. **వాసుకి** నామక శ్శేషః భూమిం వహతి. "భూమిః స్థిరా సస్యఫలాభివృద్ధిః । భూమిం వహే వాసుకి నామ్ని నాగే " నేల మంచిగా ఉండి పంటలు బాగా పండును.

### రవిచార ఫలం

వత్సరాది నుండి ఏప్రిల్ 13 వరకు "సర్వధాన్య మహర్ఘతా। లవణం తిల తైలాని మహర్ఘత్వం ప్రయాన్తి వై" అన్ని ధాన్యములకు, ఉప్పు, నువ్వులు, నూనె, మొదలగు వాటికి ధర పెరుగును. ఏప్రిల్ 14 నుండి మే 14 వరకు "ఫలాని తూలకం తథా। ఇక్ష్వాది తిల తైలం చ మహర్ఘత్వం ప్రయాన్తి వై" పండ్లు, ప్రత్తి, చెఱుకు, నువ్వుల నూనె మొదలగునవి ధర పెరుగును. మే 15 నుండి జూన్ 14 వరకు "సర్వధాన్య మహర్ఘతా" అన్ని ధాన్యములకు వెల హెచ్చును. జూన్ 15 నుండి జూలై 16 వరకు "కర్పాసం కంద మూలం చ తిలాశ్చ వసుధా తలే। సర్వధాన్యం మహర్ఘత్వం" ప్రత్తి, దుంపలు, నువ్వులు అన్ని ధాన్యములకు ధరలు పెరుగును. జూలై 17 నుండి ఆగస్టు 16 వరకు "ఆశ్లేషాయాం తత్ర వర్షతి। ధాన్యాని తు మహార్ఘాణి లోకే చోర భయం తథా" ఆశ్లేష కార్తెలో వర్షములు కురియును. ధాన్యములకు విలువ పెరుగును. దొంగల బాధ మెండుగ ఉండును. ఆగస్టు 17 నుండి సెప్టెంబరు 16 వరకు "ఇక్ష్వాది ర్మిష్ట శర్కరా। రక్తాని సర్వధాన్యాని తిలా స్తైలం మహార్ఘతా" చెరకు, పంచదార, అన్ని ధాన్యములు, నూనెలు మొదలగునవి ధరలు పెరుగును. సెప్టెంబరు 17 నుండి అక్టోబరు 16 వరకు "మంజిషాది మహర్ఘతా। నారికేళం తిలాస్తైలం సర్వసస్య మహార్ఘతా" బంగారము, పసుపు, కొబ్బరి, నువ్వులనూనె, సమస్త ధాన్యములకు ధర హెచ్చును. అక్టోబరు 17 నుండి నవంబరు 15 వరకు "మహార్ఘతా సర్వధాన్యానాం హేమ ద్రవ్యాణామ్ కుంజరాణాం వినాశనమ్" అన్ని ధాన్యములకు, బంగారు వస్తువులకు ధర పెరుగును. ఏనుగులు నశించును. నవంబరు 16 నుండి డిశెంబరు 15 వరకు "తదాన్నస్య మహర్ఘతా। సర్వ ద్రవ్యాణి స్వల్పార్ఘత్వం ప్రయాన్తి వై" అన్నమునకు వెల హెచ్చును. ఇతర సర్వపదార్థములకు ధర తగ్గును. డిశెంబరు 16 నుండి జనవరి 13 వరకు "తృణ కాష్ఠం చతుష్పదం మహార్ఘం జాయతే సర్వం" గడ్డి, కొయ్య, పశువులు మొదలగు వాటికి ధర హెచ్చును. జనవరి14 నుండి ఫిబ్రవరి 12 వరకు "ఘృత తైల మహార్ఘతా। సుభిక్షం సర్వ ధాన్యానాం లోకానాం దుఃఖ పీడనమ్" నెయ్యి, నూనెలకు ధర పెరుగును. ధాన్యము సమృద్ధిగా నుండును. కానీ ప్రజలు సంతోషముగా ఉండలేరు. ఫిబ్రవరి 13 నుండి మార్చి 14 వరకు "సమృద్ధి స్తత్ర జాయతే। లవణం తిలతైలాని స్వల్పార్ఘత్వం ప్రయాన్తి వై" సర్వపదార్థములు సమృద్ధముగా నుండును. ఉప్పు, నువ్వులు, నూనెలు మొదలైనవి ధరలు తగ్గును. మార్చి 15 నుంచి వత్సరపర్యన్తం "సర్వధాన్య మహర్ఘతా। లవణం తిలతైలాని మహర్ఘత్వం ప్రయాన్తి వై" అన్ని ధాన్యములకు, ఉప్పు, నువ్వులు, నూనెలు మొదలగునవి ధర పెరుగును.

### ఆర్ద్రా నక్షత్ర ప్రవేశ రవి ఫలమ్

**వారఫలం:** అనావృష్టి, **తిథిఫలం:** ఉత్తమం, **నక్షత్రఫలం:** అనారోగ్యములు, **యోగఫలం :** సుభిక్షము, **కరణఫలం:** సుభిక్షకరము, **లగ్నఫలం:** వాయు పీడలు, **కాలఫలం:** అధిక పంటలు, **మండలఫలం:** అధిక ధరలు, **గ్రహస్థితి ఫలం:** జల సంపద బాగుండును.

### మకర సంక్రాంతి పురుష ఫలమ్



**అష్టకర్ణో విశాలాక్షో లమ్బభ్రూ దీర్ఘనాసికః।**
**అష్టబాహు శ్చతుర్వక్త్రః సంక్రాన్తేః పురుషాకృతిః ॥**
**శత యోజన మౌన్నత్యం విస్తారో ద్వాదశ స్మృతః।**
**ఏవం రూపం తు విజ్ఞేయం సంక్రాన్తేః పురుషస్య హి ॥**

ఈ సంక్రాంతి పురుషనకు **మిశ్రుడు** అను పేరు. ఈ సంక్రాంతి పురుషుడు శంఖ జలముచే స్నానము చేసి, ఎఱ్ఱని వస్త్రములను ధరించి, చందనపు గంధమును పూసుకొని, జాజి పుష్పములను మరియు ముత్యములతో కూడిన ఆభరణములను ధరించినవాడై వెండిపాత్రలో పాయసమును భుజించి, అరటిపండును సేవించి, భిండివాలమును ఆయుధముగా చేపట్టి **వ్యాఘ్ర వాహనము**ను ఎక్కి ఎఱ్ఱని గొడుగు ఆచ్ఛాదనతో ఖడ్గమును ధరించి దక్షిణదిక్కుగా ప్రయాణము చేయుచూ క్రోధముగా కూర్చుని యుండును. ఈ రకమైన సంక్రాంతి పురుషుని స్థితి వలన అందరకును కొద్దిగా అనారోగ్యములు కలుగుచున్నను మొత్తము మీద శుభకరముగాను, శుభప్రదముగాను ఉండును. కాగా, పశువులకు అన్నిరకాలుగా కీడు పెరుగును. అందరిలోను యుద్ధభయములు పెరుగును. స్త్రీలకు కొంత అరిష్టములు కలుగుచున్నను కీర్తివంతులగుదురు. ముత్యములకు విలువ కొంత తగ్గును. ముఖ్యముగా దక్షిణ ప్రాంతములలో దుర్భిక్షములు కొంతమేర పెరుగును. ధరలు కూడా అధికమగును. మిగిలిన ప్రాంతముల వారికి కొంత ఆరోగ్యవృద్ధి, ఆ ప్రాంతములలో సస్యవృద్ధి బాగుండును. కాగా మొత్తము మీద ఆరోగ్యము, సస్యవృద్ధులతో కొంత వరకు శుభముగానే ఉండును.

**పక్షఫలమ్:-** శ్లో॥ శుక్ల పక్షే యదా పౌషే మకరస్థే దివాకరే। హాహాకారం జగత్సర్వం దుర్భిక్షం క్షామదాంబరమ్ ॥ పుష్య శుక్లమున మకర సంక్రాంతి అగుట వలన అంతటా దుర్భిక్షము, క్షామము పెరుగును.

**తిథిఫలం :** ఉత్తమం, **వారఫలం :** అధికధరలు, **నక్షత్రఫలం :** విరోధములు, **లగ్నఫలం :** క్షీరవృద్ధి, **కాలఫలం :** విప్రహాని.

సంక్రాంతి పురుషోత్పత్తికాలే దానం స్వశక్తితః।
ఫలం కాంస్యాది ధాన్యాని దీయతే దోషనాశనమ్ ॥
ఫలాని మూలాన్యజినం సువర్ణం గ్రామాంశుకాద్యం సతిలేక్షు గావః।
ధాన్యం ఖరాంశో ర్మకర ప్రవేశ ఏతాని దానాని విశేషితాని ॥

### చంద్రచారః

**జ్యేష్ఠ శుక్ల ప్రతిపత్ యుక్త భృగువార ఫలం :** శ్లో॥ ప్రజారోగ్యం సుభిక్షం చ క్షేమం సస్యవివర్ధనమ్। సువృష్టి స్సర్వదేశేషు జ్యేష్ఠాది ర్భృగువాసరే ॥ అందరకు మంచి ఆరోగ్యము, సుభిక్షము, క్షేమము కలుగును. మంచిపంటలు పండును. మంచి వర్షములు కురియును.

**ఆషాఢ శుక్ల పంచమీ యుక్త భృగువారఫలం :-** ఆషాఢ సిత పంచమ్యాం గురు వారో యదా భవేత్। సుభిక్షం క్షేమ మారోగ్యం జాయతే వృద్ధి ముత్తమమ్ ॥ అంతటా సుభిక్షముగా ఉండును. అందరకు ఆరోగ్యములు బాగుండును. అందరకు మంచి వృద్ధి కలుగును.

**ఆషాఢ శుక్లపక్షే స్వాతీ నక్షత్రయుక్త తిథిఫలం :-** ఆషాఢే శుక్ల పక్షే నవమీ స్వాతి సంయుతా। వాయు స్సర్వత్ర సంవాతి భూమౌ బీజం న వాపయేత్ ॥ అంతటా అధికముగా గాలులు వీచును. బీజావాపములకు అనుకూలము కాదు.

## మిథునరాశి



**సౌర గోచారము : మిథున మాసములో పుట్టిన వారికి**
**చాంద్ర గోచారము : మృగ 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3**
**నామ నక్షత్రము : కా, కి, కూ, ఖం, ఙ్ఞ, ఛ్ఛ, కే, కో, హ**
**ఆదాయం 5, వ్యయం 5, రాజపూజ్యం 3, అవమానం 6**

**గురువు** : సెప్టెంబరు 14 వరకు 9న లోహమూర్తి. చికాకులు ఎక్కువ. తృప్తి తక్కువ. తదాది నవంబరు 20 వరకు 8న తామ్రమూర్తి. అనారోగ్యములు, ఆందోళనలు ఎక్కువగా ఉండును.తదాది వత్సరపర్యన్తం 9న లోహ మూర్తి. తరచు రుగ్మత, వ్యవహారములందు వ్యతిరేకత కలుగును.

**శని** : ఈ వత్సరమంతయు 8న లోహమూర్తి. చాలా శ్రమ చేయును. విఘ్నము లెక్కువ. ఆరోగ్యము తక్కువ. అయినవారితో చికాకులు ఎక్కువగును.

**రాహువు** : ఈ వత్సరమంతయు 12న సువర్ణమూర్తి. అనారోగ్యం, కొంచెం లాభము కనబడును. చికాకులు పెరుగును.

**కేతువు** : ఈ వత్సరమంతయు 6న సువర్ణమూర్తి. లాభం, సంతోషం, సౌఖ్యము వృద్ధి చెందును.

మొత్తము మీద ఈ రాశి వారికి గ్రహస్థితి శుభాశుభ మిశ్రమంగా ఉన్నది. వివాదాస్పద వ్యవహారాలు ఉన్నప్పటికి వాటికి దూరంగా ఉండటం చాలా మంచిది. మీపై వచ్చే నిరాధార నిందలను గూర్చి పట్టించుకోకుండా మీ కర్తవ్యాన్ని నిర్వహిస్తారు. వ్యక్తిగత విషయాలను గోప్యంగా ఉంచడం ద్వారా ఉత్తమ ఫలితాలను పొందగలుగుతారు. విద్య, ఆరోగ్య, ఆర్థిక, సామాజిక విషయాలలో మరింత జాగ్రత్తగా ఉండవలసిన అవసరం కనిపించుచున్నది. వివాహాది శుభకార్యములను శ్రమతో పూర్తి చేస్తారు.

**చైత్రం :** ఈ మాసములో రవి, గురు, శుక్ర, కేతువులు శుభులు. కుజ, బుధులు అర్ధ శుభులు. శుభకార్యములకు పునాది పడును. ఆరోగ్యమునకై శ్రద్ధ చూపవలెను. ఉద్యోగులు కోరిన ప్రాంతములకు బదిలీలను పొందగలరు. వ్యాపారులకు, రైతులకు ధనలాభము కలుగును. ప్రయాణములు కలిసివచ్చును. సైన్సు రంగము వారికి ఎక్కువ అభివృద్ధి కలుగును. భవిష్య ప్రణాళికలకు అనువైన కాలము. బ్యాంకు, రెవెన్యూ, పోస్టల్, ఉపాధ్యాయ వృత్తి నిర్వహించేవారికి ఉన్నతాధికారుల నుండి ఒత్తిడి పెరుగుతుంది.

**వైశాఖం :** ఈ మాసములో గురు, శుక్ర, కేతువులు శుభులు. కుజ, బుధులు అర్ధ శుభులు. పారిశ్రామిక, కార్మిక సమస్యలు ఒక కొలిక్కి వస్తాయి. పురోహితులకు, తదితర వివిధ వృత్తులలో ఉన్నవారికి సదవకాశాలు లభిస్తాయి. వ్యాపారులకు ఒత్తిడి, శ్రమ ఎక్కువ అవుతాయి. గృహంలో ఏదైనా విలువైన వస్తువు పోయేందుకు ఆస్కారం ఉన్నది. పెద్దల ఆరోగ్యం గురించి ఆందోళన పడవలసి వస్తుంది. పాత వ్యవహారాలు వాయిదా పడటం మంచిది.

**జ్యేష్ఠం :** ఈ మాసములో గురు, శుక్ర, కేతువులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. అగ్రిమెంట్లు, ఉత్తరప్రత్యుత్తరాలకు ఈ మాసం అనుకూలంగా ఉన్నది. నూతనోత్తేజం, ఉత్సాహం తొణికిసలాడుతుంది. వివాహాది శుభకార్య ప్రయత్నములు అనుకూలించే సమయం ఆసన్నమైనది. విదేశీ గమనం, ఉన్నత విద్యలు, రచనలు, ప్రచురణలు బాగా అనుకూలిస్తాయి. ద్వితీయార్ధంలో అందరితోను అనవసర తగాదాలు, మిత్ర ద్రోహం, మనశ్శాంతి కోల్పోవుట, రహస్య అనుబంధాలు ఆందోళన కలిగిస్తాయి.

**ఆషాఢం :** ఈ మాసములో బుధ, గురు, శుక్ర, కేతువులు శుభులు. రవి, కుజులు అర్ధశుభులు. వివాహాది శుభకార్యములను బంధుమిత్ర సహకారముతో నిశ్చయం చేసికోగలుగుతారు. వ్యాపారస్థులకు ఆదాయ వ్యయములు సమానముగా ఉండును. భూ, గృహ సంబంధ విషయాలు అనుకూలంగా ఉన్నాయి. ఆర్థికాభివృద్ధి గత మాసము కంటే మేలు. ద్వితీయార్ధంలో కాంట్రాక్టు పనుల వలన లాభములు, పదవీ లాభము సిద్ధించును. వైద్య, విద్యా రంగాలలోని వారికి కలసి వచ్చును.

**శ్రావణం :** ఈ మాసములో రవి, కుజ, గురు, శుక్ర, రాహు, కేతువులు శుభులు. ప్రయత్న పూర్వకముగా చేసిన పనులు సంతృప్తిని ఇస్తాయి. విదేశీ ప్రయాణము భూ, గృహ సంబంధ ప్రయత్నములు ఫలిస్తాయి. కొన్ని సౌకర్యాలు అనుభవిస్తారు. ఆర్థికంగా అనుకూలత పెరుగుతుంది. రావలసిన బకాయిలు వసూలు అవుతాయి. తగాదాలు తీర్చుట యందు పేరొందుదురు. ఆఫీసర్లు పై వారికి క్రింది వారికి మధ్యన ఇరుకుపడగలరు. నిరుద్యోగులకు ఉపాధి కలుగును.

**భాద్రపదం :** ఈ మాసములో శుక్ర, కేతువులు శుభులు. రవి అర్ధశుభుడు. కుటుంబ సభ్యుల ఆరోగ్యం గురించి ఆందళన ఉంటుంది. ఆడిటర్లకు, ఇంజనీరింగ్ రంగలలో ఉన్నవారికి అధిక శ్రమ. వాహనం నడిపేటప్పుడు మెలకువ అవసరం. వాణిజ్యం పట్ల ఆసక్తి పెరుగుతుంది. క్రయ విక్రయ రంగాలలో ఉన్నవారికి చికాకు తప్పదు. ఆర్థిక నష్టము రాకుండా ఉండుటకై జాగ్రత్త వహించవలెను. బంధుమిత్రులతో ఆకస్మిక కలహాలేర్పడి, యథార్థం గ్రహించి పశ్చాత్తాపపడతారు.

**ఆశ్వయుజం :** ఈ మాసములో కేతువు శుభుడు. రవి, గురువులు అర్ధశుభులు. అయిన వాళ్ళు చేసే పనుల వల్ల మీ వ్యక్తిగత ప్రతిష్ఠ దెబ్బతినే అవకాశం ఉన్నది. అడ్వాన్సులు, ఋణాలు లభించవచ్చు. కొత్త ఉద్యోగానికి లేదా ప్రస్తుతం ఉద్యోగంలో మార్పుకు ఈ కాలం ప్రశస్తం. మాట విలువ తగ్గును. కుటుంబ వ్యవహారములు చికాకును కలిగించును. నిర్మాణ ప్రయత్నములు నిలిచిపోవును. వృత్తి వ్యాపారములందు మంచి చెడ్డలు సమానంగా ఉండును.

**కార్తికం :** ఈ మాసములో కేతువు శుభుడు. రవి, బుధ, గురు, శుక్రులు అర్ధశుభులు. ఉద్యోగ రంగంలో అధికారులు వత్తిడికి లోనవుతారు. ఆర్థిక విషయాలలో వత్తిడి ఎక్కువవుతుంది. పనులలో చికాకు పెరుగుతుంది. మాసమధ్యంలో నూతన ప్రయాణ ములకు అవకాశాలు కలుగును. శాస్త్రవేత్తలకు ప్రోత్సాహం, గుర్తింపు లభిస్తాయి. అధికారులను, ప్రముఖులను సంప్రదిస్తారు. నీచులైన వారితో గొడవలు ఉంటాయి. ఆరోగ్యం విషయంలో ఎక్కువ శ్రద్ధ పట్టాలి. హామీలు ఇవ్వటం మంచిది కాదు.

**మార్గశిరం :** ఈ మాసములో కుజ, గురు, కేతువులు శుభులు. రచయితలకు, శాస్త్రజ్ఞులకు, కళాకారులకు ఆయా వృత్తుల వారికి గుర్తింపు లభిస్తుంది. కాంట్రాక్టర్లకు అధికారులతో సమస్యలు తలెత్తుతాయి. ప్రభుత్వ ఉద్యోగులకు బదలీలు కలుగవచ్చు. మాసాంతములో పరస్త్రీ వ్యామోహం పెరుగుట, పాత బాకీలు తీర్చుట, మనోవేదనలు కలుగును. భార్య తరపు బంధువుల నుండి శుభవార్త వింటారు. సోదరులతో విభేదాలు వచ్చు అవకాశాలు ఉన్నాయి.

**పుష్యం :** ఈ మాసములో బుధ, గురు, కేతువులు శుభులు. కుజుడు అర్ధశుభుడు. కొత్త అనుభవాలు గడిస్తారు. మీ ఆలోచనలను ఆచరణలో పెడతారు. ప్రయాణాలు లాభిస్తాయి. విలువైన ఆభరణాలు, వస్తువులు సమకూర్చగలుగుతారు. దూరపు బంధు మిత్రులు కొన్ని కార్యక్రమాలలో విశేషంగా సహకరిస్తారు. చేతిలో పని ముగింపు దశకు వస్తుంది. మాసాంతమున కొద్దిగా భాగస్వాములలో కలహము, ధననష్టం, ఆకస్మిక ప్రయాణములు, శారీరిక ఇబ్బందులు కలుగును. అధికారంలో ఉన్నవారికి నోటిదురుసుతనం వలన ఇబ్బందులు వచ్చును.

**మాఘం :** ఈ మాసములో బుధ, గురు, కేతువులు శుభులు. రవి, శుక్రులు అర్ధశుభులు. గత అనుభవాలు గుర్తుకు వస్తాయి. వ్యవసాయదారులకు వాతావరణం అనుకూలించక చికాకుగా ఉంటుంది. దైవ సందర్శనము, మిత్రుల సహకారం, దానధర్మములు చేయుట, సంతానమునకు అభివృద్ధి కలుగును. వ్యాపారస్థులకు ధన నష్టములు, మిత్రులకు అనారోగ్యము, శారీరిక ఇబ్బందులు మొదలగునవి కలుగును. మానసిక చింత ఎక్కువ.

**ఫాల్గునం :** ఈ మాసములో రవి, గురు, కేతువులు శుభులు. బుధ, శుక్రులు అర్ధశుభులు. వివాహాది శుభ కార్యములు స్థిరపడతాయి. నూతన వ్యక్తుల పరిచయం ఎంతో సంతృప్తి నిస్తుంది. విద్యార్థులకు కళలపై ఆసక్తి పెరుగుతుంది. ఉద్యోగులు బదలీలు కోరకుండుట మేలు. ఇతర ప్రాంతాల నుండి ఆదాయం బాగా ఉంటుంది. సాంస్కృతిక కార్యక్రమాలల్లో, విద్యా విషయాల్లో పాలు పంచుకొంటారు. ఊహించని రీతిలో ఇతరులతో విరోధం, కొట్లాటలు ఉంటాయి.

### సంగ్రహ సంవత్సర ఫలం

**మృగశిర** : సంపద వృద్ధి, ద్రవ్యలాభం, మనోల్లాసము, కుటుంబ సౌఖ్యము, సంఘములో పలుకుబడి పెరుగును.

**ఆర్ద్ర** : వత్సరమంతయు గురువు అనుకూల్యత లేదు. వత్సరమంతయు శని, రాహు, కేతువుల అనుకూల్యత బాగున్నది.
కీర్తి ప్రతిష్ఠలు, మధ్యవర్తిత్వములు, స్నేహబాంధవ్యాలు పెరుగుట, అనారోగ్యములు, అధిక ఖర్చులు పెరుగును.

**పునర్వసు** : వత్సరాది మార్చి 1 వరకు గురువు అనుకూల్యత లేదు. తదాది వత్సర పర్యన్తం అనుకూల్యత బాగున్నది. వత్సరమంతయు శని కేతువుల అనుకూల్యత బాగున్నది. వత్సరమంతయు రాహువు అనుకూల్యత లేదు. ఆరోగ్యం, ఆనందము, ఇష్టప్రాప్తి, ఊహించని లాభాలు, గృహప్రాప్తి సిద్ధించును.

**ఈ రాశి వారు ఈ సంవత్సరం ప్రతిరోజు శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

## కర్కాటక రాశి



**సౌర గోచారము : కర్కాటక మాసములో పుట్టిన వారికి**
**చాంద్ర గోచారము : పునర్వసు 4; పుష్యమి, ఆశ్రేష**
**నామ నక్షత్రము : హి, హు, హే, డ, డీ, డూ, డే, డో**
**ఆదాయం 14, వ్యయం 2, రాజపూజ్యం 6, అవమానం 6**

**గురువు** : సెప్టెంబరు 14 వరకు 8న తామ్రమూర్తి. అనారోగ్యములు, ఆందోళనలు ఎక్కువగా ఉండును. తదాది నవంబరు 20 వరకు 7న సువర్ణమూర్తి. అన్ని రంగములయందు విషమ సమస్యలు తీరును. తదాది వత్సరపర్యన్తం 8న సువర్ణమూర్తి. శుభాశుభ మిశ్రమముగా ఉండును.

**శని** : ఈ వత్సరమంతయు 7న తామ్రమూర్తి. శత్రుబాధ ఎక్కువగా ఉండును. సమయమునకు తగువిధముగా ఆదుకొనువారు కరువగుదురు.

**రాహువు** : ఈ వత్సరమంతయు11న తామ్రమూర్తి. కొద్దిపాటి నష్టంతో లాభము కలుగచేయును.

**కేతువు** : ఈ వత్సరమంతయు 5న తామ్రమూర్తి. ఊహించని మానసిక చికాకులు ఎక్కువగును.

మొత్తము మీద ఈ రాశి వారికి ఈ సంవత్సరము శుభాశుభ మిశ్రమముగా ఉన్నది. వృత్తి, వ్యాపార వ్యవహారాలలో అనుకూలత ఉంటున్నప్పటికిని తరచు ఋణబాధ మానసిక ఆందోళనకు గురిచేస్తుంది. క్రొత్త క్రొత్త ఆలోచలనతో ముందుకు సాగుతారు. శుభకార్యములకు, విద్యా వ్యవహారాలకు, ఆర్థిక వ్యవహారాలకు సహకారం కొంత తక్కువగానే లభిస్తుంది. కుటుంబ వ్యవహారాలలో అయినవారికి మనస్తాపం కలుగకుండ జాగ్రత్త పడాలి. ఆరోగ్య విషయంలో కొంత జాగ్రత్త తీసుకోవాలి.

**చైత్రం :** ఈ మాసములో రవి, బుధ, రాహువులు శుభులు. కోర్టు వ్యవహారములలో రాజీ ప్రయత్నము ఉత్తమము. సస్పెండు అయ్యే సూచనలున్నాయి. కుటుంబ వ్యవహారములు అనుకూలముగా ఉండును. అనవసరపు ఆందోళనలకు గురవుతారు. కుటుంబ మూలకంగా ఖర్చులు ఎక్కువవుతాయి. పిల్లల్ని సంతృప్తి పరచడంలో విఫలమవుతారు. ద్వితీయార్థంలో ఆతృతగా ఎదురుచూచు శుభవార్తలు సమయానికి అందడంతో ఆనందం అనుభవిస్తారు.

**వైశాఖం :** ఈ మాసములో రవి, శుక్ర, రాహువులు శుభులు. బుధుడు అర్ధశుభుడు. జర్నలిజం చేసే వారికి ఉన్నత విద్య చేసే అవకాశం ఉన్నది. విద్యార్థులకు కళలపై ఆసక్తి పెరుగుతుంది. ఉద్యోగులు బదిలీలు కోరకుండుట మేలు. కోర్టు వ్యాపారములు, వ్యవహారములు అనుకూలముగా ఉండును. అన్ని రంగాలలో పనులు స్తంభిస్తాయి. అధికారంలో ఉన్నవారికి నోటి దురుసుతనం వలన ఇబ్బందులు వచ్చును. డబ్బు పొదుపు చేయడం కంటే, ఖర్చు ఎక్కువ చేయాల్సి వస్తుంది.

**జ్యేష్ఠం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. కుజ, బుధులు అర్ధశుభులు. సంస్థాగత వ్యవహారాలకు సానుకూలత ఉంది. కోరుకొన్న శాఖకు బదిలీ అవుతారు. బాధ్యతలు పెరిగే అవకాశం ఉన్నందువల్ల చిన్నపాటి పదవులు వరించును. ద్వితీయార్థం నుండి విద్యార్థులకు చదువు మీద శ్రద్ధ తగ్గి, ఇతర విషయముల మీద శ్రద్ధ పెరుగుతుంది. వాహన ప్రమాదములు కలుగు సూచనలున్నాయి. కోర్టు వ్యవహారములు స్తంభించును.

**ఆషాఢం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. ఇప్పటి వరకు వాయిదా పడుతున్న పనులు పునః ప్రారంభమవుతాయి. స్థిర, చరాస్తుల విషయంలో ఒక నిర్ణయానికి వస్తారు. దైవకార్యక్రమాలపై ఆసక్తి పెరుగుతుంది. అనురాగ, వాత్సల్యాలు పెంపొందుతాయి. ద్వితీయార్థం నుండి మీ వ్యక్తిగత సమస్యలను బయటకు వ్యక్తం చేయకండి. మధ్య మధ్య అనవసరపు ఆందోళనలకు గురవుతారు. దాయాదులతో కలహాలు పెరగటం, సంతానమూలక చింత, మనశ్శాంతి కోల్పోవుట, అపకీర్తి కలుగును.

**శ్రావణం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. రుణాలు, పన్నుల చెల్లింపులు కోసం ఒత్తిడి పెరుగుతుంది. రాకపోకలలో ఆలస్యాలు, ఆటంకాలు, వ్యర్థ ప్రసంగాలు మీ పనులకు ఆటంకం కలిగిస్తాయి. మాసాంతములో ఆర్థికంగా పుష్టి కలగడం, భార్యకు అలంకార ప్రాప్తి, కుటుంబ సౌఖ్యం, జ్ఞానులతో సత్సంగం, గురువుల దర్శనము, తీర్థయాత్రలు చేయటం, దైవమునందు, గురువులయందు భక్తి శ్రద్ధలు కలుగును.

**భాద్రపదం :** ఈ మాసములో కుజ, గురు, శుక్ర, రాహువులు శుభులు. రవి అర్ధ శుభుడు. వాహన సౌఖ్యం, సంఘంలో పేరు, రాజకీయ నాయకుల పరిచయము, ప్రభుత్వ అధికారులతో సఖ్యత, వ్యాపారమందు సంతృప్తి కలుగును. కుటుంబ సౌఖ్యము పెరుగును. అప్పుల బాధ తగ్గుతుంది. కోర్టు వ్యవహారములు పునర్విమర్శకై వచ్చును. ఉద్యోగులు బదిలీలు కోరకుండుట మేలు. హామీలుండటం మంచిది కాదు. భాగస్వాముల మధ్య విభేదాలు తలెత్తుతాయి.

**ఆశ్వయుజం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. రవి, కుజ, గురువులు అర్ధశుభులు. విద్యార్థులు శ్రమ పడినచో కొన్నింటిలోనైనా విజయమును సాధించగలరు. వ్యవసాయదారులకు వాతావరణం అనుకూలించక చికాకుగా ఉంటుంది. ఆత్మీయులలో ఒకరి ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది. కొనుగోళ్ళ విషయంలో శ్రద్ధ అవసరము. మధ్యవర్తిత్వం పనికిరాదు. మాసాంతములో గ్రహస్థితి కాస్త అనుకూలంగా ఉన్నది. ప్రయత్న పూర్వకముగా చేసిన పనులలో కొన్నింట విజయమును సాధించగలరు. ఇంట్లో పోయిన వస్తువుల కోసం చేయు ప్రయత్నాలు ఫలిస్తాయి.

**కార్తికం :** ఈ మాసములో రాహువు శుభుడు. రవి, గురువులు అర్ధశుభులు. అనేక రకాలుగా చికాకులు ఎదురవుతాయి. కోర్టులలో వాయిదాలు కోరటం మంచిది. రాజకీయ వ్యవహారాలలో జయం కలుగుతుంది. వ్యవసాయ దారులకు సమయానికి ధనం అందుతుంది. బంగారపు వ్యాపారస్థులకు మేలైన ఫలితాలు కలుగుతాయి. ఆరోగ్యం విషయంలో జాగ్రత్తగా ఉండాలి. వస్త్రవ్యాపారులకు రాబడి ఖర్చు ఎక్కువగా ఉంటుంది. భాగస్వాములతోను, భార్యతోను మాటపట్టింపు రావచ్చు.

**మార్గశిరం :** ఈ మాసములో బుధ, రాహువులు శుభులు. రవి అర్ధశుభుడు. తీర్థయాత్రలు చేస్తారు. సంతానానికి కొంత అభివృద్ధికరంగా ఉంటుంది. రాజకీయ నాయకులు కొన్ని విమర్శలు ఎదుర్కోవలసి వస్తుంది. వ్యవసాయదారులు అధికంగా శ్రమించవలసి వస్తుంది. కొన్ని పరిమితులను, నియమ నిబంధనలను అనుసరించవలసి వస్తుంది. భార్యాభర్తల మధ్య సయోధ్య లోపిస్తుంది. కృషి రంగంలో మీ బాధ్యతలు పెరుగుతాయి. మానసిక చింతన ఎక్కువ.

**పుష్యం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. కుజుడు అర్ధశుభుడు. విద్యార్థులు బాగా కష్టపడి చదువుతున్నా జ్ఞాపకశక్తి లేమి వల్ల ఇబ్బంది పడుతూ ఉంటారు. కుటుంబ కలహం, దుర్వ్యసనాలకు ధనవ్యయం, ఆకస్మిక ప్రయాణాలు కలుగుతాయి. అప్పు చేయవలసి వచ్చును. వ్యవసాయ రంగమునందు, కాంట్రాక్టుల వ్యవహారములో చాలా జాగ్రత్తగా ఉండుట మంచిది. మాసాంతంలో ఉత్సాహం, ధైర్యం, ఆకస్మిక లాభాలు, అలంకార ప్రాప్తి కలుగును.

**మాఘం :** ఈ మాసములో కుజ, రాహువులు శుభులు. విద్యార్థులకు కళలపై ఆసక్తి పెరుగుతుంది. జర్నలిజం చేసే వారు ఉన్నత పదవులు చేపట్టే అవకాశం ఉన్నది. లాయర్లు, డాక్టర్లు కృషికి మించి ధనార్జన చేయగలరు. ద్వితీయార్థము నుండి ఉద్యోగులు బదిలీలు కోరకుండుట మేలు. ఫైనాన్స్ వ్యాపారులకు సమయానికి డబ్బు అందదు. రావలసిన / చెల్లించవలసిన క్లెయిములు, పద్దులు సకాలంలో పరిష్కారమవుతాయి. రివర్షన్ లేక సస్పెండు అయ్యే సూచనలు ఉన్నాయి.

**ఫాల్గునం :** ఈ మాసములో కుజ, రాహువులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. వివాహాది శుభకార్యములు, అతిప్రయాసతో నెరవేరును. కళాకారులకు, ఆధ్యాత్మిక రంగాల లోని వారికి అభివృద్ధి కలుగును. నిరుద్యోగులకు ఉపాధి కలుగును. ధనాభివృద్ధి సిద్ధించును. శాస్త్రవేత్తలకు ప్రోత్సాహం, గుర్తింపు లభిస్తాయి. వ్యవసాయం, తోటలు ఉన్నవారికి వాతావరణం ఆందోళన కలిగిస్తుంది. అన్య స్త్రీ పరిచయంవల్ల మానసిక ఆందోళనలు పెరుగును.

### సంగ్రహ సంవత్సర ఫలం

**పునర్వసు :** అనవసరపు వ్యయము, మిత్రులతో ఇబ్బందులు, సంతానమూలక ఆనందము, ఇష్టప్రాప్తి సిద్ధించును.

**పుష్యమి :** వత్సరాది మే 21 వరకు గురువు అనుకూల్యత లేదు. తదాది జూలై 19 వరకు అనుకూల్యత బాగున్నది. తదాది జనవరి 2 వరకు ఆనుకూల్యత లేదు. తదాది మార్చి 1 వరకు ఆనుకూల్యత బాగున్నది. తదాది వత్సర పర్యన్తం ఆనుకూల్యత లేదు. వత్సరమంతయు శని, రాహు, కేతువుల ఆనుకూల్యత బాగున్నది.
ధనలాభం, కార్యసిద్ధి, మాటవిలువ తగ్గటం, ఊహించని లాభాలు, ఆకస్మిక కలహాలు సిద్ధించును.

**ఆశ్రేష :** వత్సరాది మే 21 వరకు గురువు ఆనుకూల్యత బాగున్నది. తదాది జూలై 19 వరకు ఆనుకూల్యత లేదు. తదాది వత్సరపర్యన్తం ఆనుకూల్యత బాగున్నది. వత్సరమంతయు శని, రాహు, కేతువుల ఆనుకూల్యత బాగున్నది.
తరచు వివాదాలు, మనోవ్యాకులత, అనారోగ్య భావన, అనవసర ఆందోళనలు, అధిక వ్యయములు కలుగును.

**ఈ రాశి వారు ఈ సంవత్సరం ప్రతిరోజు శ్రీ శనైశ్చర స్తోత్రము మరియు గురుచరిత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

## సింహ రాశి



**సౌర గోచారము : సింహ మాసములో పుట్టిన వారికి**
**చాంద్ర గోచారము : మఘ, పూర్వఫల్గుని; ఉత్తరఫల్గుని 1**
**నామనక్షత్రము : మా, మీ, మూ, మే, మో, టా, టీ, టు, టే**
**ఆదాయం 2, వ్యయం 14, రాజపూజ్యం 2, అవమానం 2**

**గురువు** : సెప్టెంబరు 14 వరకు 7న సువర్ణమూర్తి. వివాహాది మంగళకార్యములు అతికష్టమున నెరవేరును. సౌఖ్యము పెరుగును. తదాది నవంబరు 20 వరకు 6న రజతమూర్తి. కొంత అనుకూలత కలుగును. తదాది వత్సర పర్యన్తం 7న తామ్రమూర్తి. అనారోగ్యములు, అపకీర్తి పెరుగును.

**శని** : ఈ వత్సరమంతయు 6నసువర్ణమూర్తి. లాభం, సంతోషం, సౌఖ్యము వృద్ధి చెందును.

**రాహువు** : ఈ వత్సరమంతయు 10న లోహమూర్తి. అన్ని రంగములలో అడ్డంకులు ఏర్పడును.

**కేతువు** : ఈ వత్సరమంతయు 4న లోహమూర్తి. అనారోగ్య భావన, మానసిక ఆందోళనలు పెరుగును.

మొత్తము మీద ఈ రాశి వారు ప్రథమార్థంలో అన్ని రంగాలలోను కొంత ఇబ్బందులను ఎదుర్కొంటారు. ఆర్థిక వ్యవహారాలు కూడ కొంత మానసిక వత్తిడిని కలిగిస్తాయి. విద్యార్థులు కొద్దిగా ఎక్కువ కష్టపడాలి. వృత్తి, వ్యాపార, ఉద్యోగ వ్యవహారాలలో నియమాలను అనుసరించి కొంత ఇబ్బంది పడతారు. ద్వితీయార్థం నుండి కొంత అనుకూలత పెరుగుచున్నది. శుభకార్యములు సకాలంలో నెరవేరుస్తారు. భాగస్వామ్య వ్యవహారాలు కొంత లాభిస్తాయి.

**చైత్రం :** ఈ మాసములో కుజ, గురు, శుక్ర, శనులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. అన్నింటిలోను విజయావకాశాలతో ముందుకు సాగుతారు. సోదరులు పరస్పరం సహాయము చేసుకుంటారు. కొన్ని సమస్యలు పరిష్కారవుతాయి. అప్పు వసూలు చేయటంలో నైపుణ్యాన్ని చూపిస్తారు. మార్కెటింగ్, పర్యాటక రంగాల వారికి పదోన్నతి కలుగుతుంది. ద్వితీయార్థంలో ఊహించని విషయాలు ముందుకు వచ్చి భ్రమకు లోను చేస్తాయి. ప్రతి పనిలో ఆలస్యం, ఆటంకాలు ఎదురవుతాయి.

**వైశాఖం :** ఈ మాసములో రవి, బుధ, గురు, శనులు శుభులు. కుజ, శుక్రులు అర్ధ శుభులు. రుణ ప్రయత్నం ఫలిస్తుంది. అందరితో కలసి విందులు, వినోదాలలో పాల్గొంటారు. ఉద్యోగులకు బాధ్యతలు పెరుగుతాయి. కొంతమంది మీ సహాయం పొంది మిమ్మల్ని తక్కువగా అంచనా వేస్తారు. రాజకీయాల్లో ఉన్నవారికి గుర్తింపు లభిస్తుంది. విద్యార్థుల విద్యా వ్యాసంగానికి అవరోధాలు ఏర్పడును. ప్రమోషన్ల వల్ల అనుకూల స్థానచలనాలు జరుగుతాయి. నూతన గృహ, ఉద్యోగ, వృత్తి కార్యాలు ఫలిస్తాయి.

**జ్యేష్ఠం :** ఈ మాసములో రవి, బుధ, గురు, శుక్ర, శనులు శుభులు. మీ వాక్చాతుర్యంతో అందరిని ఆకట్టుకుంటారు. లాయర్లకు, ఋణబాధలు తగ్గును. విద్యార్థులకు విద్యా వ్యాసంగము పెరుగును. స్త్రీలు తమ ఆలోచనలు సఫలం అయ్యేటందుకు కృషి చేసి విజయం పొందుతారు. అయిన వారి నుండి మంచివార్తలు వింటారు. ఊహించని విధంగా ఆదాయం పెరుగుతుంది. ప్రయత్న కార్యాలన్నీ సులభంగా ఫలిస్తాయి. కళాకారులకు, ఆధ్యాత్మిక రంగాలలోని వారికి అభివృద్ధి కలుగును.

**ఆషాఢం :** ఈ మాసములో గురు, శుక్ర, శనులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. పారిశ్రామిక, కార్మిక సమస్యలు ఒక కొలిక్కి వస్తాయి. పురోహితులకు, తదితర వివిధ వృత్తులలో ఉన్నవారికి సదవకాశాలు లభిస్తాయి. వ్యాపారులకు ఒత్తిడి, శ్రమ ఎక్కువ అవుతాయి. ఒక విలువైన వస్తువు పోయేందుకు ఆస్కారం ఉన్నది. పెద్దల ఆరోగ్యం గురించి జాగ్రత్త పడవలసి వస్తుంది. సంఘంలో మంచి కీర్తిని గడించగలరు. నిరుద్యోగులకు ఉపాధి లభించును.

**శ్రావణం :** ఈ మాసములో బుధ, గురు, శుక్ర, శనులు శుభులు. కుజుడు అర్ధశుభుడు. అనవసరపు ఖర్చులు మీద పడును. కుటుంబమున చికాకు పెరుగును. అయినను భార్యా బిడ్డల సహకారం చక్కగా ఉంటుంది. కోర్టు వ్యవహారములు వాయిదా కోరుట మంచిది. మాతృవర్గ బంధువులతో విరోధములు, మానసిక ఇబ్బందులు, ఆర్థిక సమస్యలు, కటువుగా మాట్లాడుట జరుగును. మాసాంతములో దైవ సందర్శనము, మిత్రుల సహకారం, కీర్తి ప్రతిష్ఠలు కలుగును.

**భాద్రపదం :** ఈ మాసములో శుక్ర, శనులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. రాజకీయ రంగంలోని వారికి ఉన్నత పదవులు, పలుకుబడి పెరుగును. గృహమందు, ఉద్యోగమునందు కొన్ని మార్పులు కనబడును. కోర్టు వ్యవహారాలు, వృత్తి వ్యాపారాలు, స్పెక్యులేషన్లు అనుకూలంగా ఉంటాయి. నూతన వస్త్రాభరణాలు సమకూర్చుకుంటారు. ఆధ్యాత్మిక, వైజ్ఞానిక, సాంస్కృతిక విషయాలలో ఆసక్తి చూపుతారు.

**ఆశ్వయుజం :** ఈ మాసములో శుక్ర, శనులు శుభులు. రవి, కుజ, బుధ, గురువులు అర్ధశుభులు. ఉత్తరప్రత్యుత్తరాలకు ఈ మాసం చాలా అనుకూలంగా ఉన్నది. నూతనోత్తేజం, ఉత్సాహం తొణికిసలాడుతుంది. విదేశీ గమనం, ఉన్నత విద్యలు, రచనలు, ప్రచురణలు బాగా అనుకూలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు సమర్థతతో నిర్వహిస్తారు. మీ ఆకర్షణలతో మిత్రులను, అభిమానులను సుముఖం చేసుకుని సహకారం పొందగలరు.

**కార్తికం :** ఈ మాసములో కుజ, శనులు శుభులు. రవి, గురువులు అర్ధశుభులు. ప్రథమార్థంలో ఏ పని ఆరంభించినా విఘ్నాలు ఎదురవుతూంటాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ, భూ గృహ విషయాలలో చికాకులు పెరుగును. విద్యార్థులకు విద్యాభ్యాసం కొంత కఠినంగా ఉంటుంది. ఉద్యోగులకు బదిలీలు సక్రమంగా ఉండవు. విద్యార్థులు పరీక్షల పట్ల లేనిపోని అపోహలకు లోనై ఆందోళన చెందుతారు. ద్వితీయార్థం నుండి మిత్రులు శత్రువులు అయ్యే అవకాశం ఉంది.

**మార్గశిరం :** ఈ మాసములో గురు, శుక్ర, శనులు శుభులు. రవి అర్ధశుభుడు. పెద్దలతో ఆంతరంగిక చర్చలు ఫలిస్తాయి. శ్రమకు తగిన ప్రతిఫలం పొందుతారు. చేపట్టిన పనులు ముగింపు దశకు వస్తాయి. ద్వితీయార్థంలో ఇతరుల వ్యవహారాలలో తలదూర్చుటం వలన మాట పడక తప్పదు. ప్రైవేట్ సంస్థలలో ఉన్నవారికి, ఉపాధ్యాయులకు అనుకూలం కాదు. స్పెక్యులేషన్‌పై ఆసక్తి పెరుగుతుంది. సోదరీ, సోదరులతో మెలకువగా వ్యవహరించాలి.

**పుష్యం :** ఈ మాసములో బుధ, గురు, శుక్ర, శనులు శుభులు. రవి అర్ధశుభుడు. ప్రథమార్థంలో మానసికమైన చికాకులు పెరుగుతాయి. చేయదలచిన పనులలో ఒత్తిడి, శ్రమ కలుగుతుంది. ఆర్థికంగా, వ్యావహారికంగా దాపరికం అవసరం. ఆంతరంగిక సమస్యల వలన నిందలు, అవమానాలు ఎదురవుతాయి. ద్వితీయార్థం నుండి తీర్థ యాత్రలు, క్షేత్రదర్శనం వలన కాస్త ఊరట కలుగుతుంది. మీ శ్రమకు తగిన ఫలితం, గుర్తింపు లభిస్తాయి.

**మాఘం :** ఈ మాసములో బుధ, గురు, శనులు శుభులు. ఆరోగ్యం విషయంలో మెలకువ అవసరం. విశ్రాంతికి చేసే ప్రయత్నాలు అనుకూలించవు. కుటుంబ సభ్యుల ధోరణి ఆశ్చర్యం కలిగిస్తుంది. అధికారులను, రాజకీయనాయకులను కలుసుకుంటారు. స్త్రీలకు గుర్తింపు, రాణింపు ఉంటాయి. కోర్టు వ్యవహారాదులలో విజయం సాధిస్తారు. కూరలు, పండ్ల వ్యాపారులకు శుభదాయకం. ఇతరుల అవమానానికి గురి కావచ్చు.

**ఫాల్గునం :** ఈ మాసములో గురు, శనులు శుభులు. బుధుడు అర్ధశుభుడు. ప్రథమార్ధములో అంతటా అనుకూలతలు బాగున్నవి. ద్వితీయార్ధము నుండి వ్యాపారరంగములో ఉన్నవారికి కొంతమేర అనుకూలించును. వ్యవసాయదారులకు పెట్టుబడులు అందుట కష్టము. డాక్టర్లకు, అడ్వకేట్లకు శ్రమయే మిగులు సూచనలు ఉన్నాయి. ఫైనాన్స్ వ్యాపారము చేయువారికి ఇక్కట్లు మొదలగును. తల్లి ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేయటం మంచిది కాదు. అధికారులతో విరోధాలు పెరుగుతాయి.

### సంగ్రహ సంవత్సర ఫలం

**మఘ** : వత్సరాది సెప్టెంబరు 14 వరకు గురువు ఆనుకూల్యత లేదు. తదాది నవంబరు 20 వరకు ఆనుకూల్యత బాగున్నది. తదాది వత్సరపర్యన్తం ఆనుకూల్యత లేదు. వత్సరమంతయు శని ఆనుకూల్యత లేదు. వత్సర మంతయు రాహు కేతువుల ఆనుకూల్యత బాగున్నది.
సంఘ గౌరవము, సేవాభిలాషవృద్ధి, వ్యవహార దక్షత, బంధుమిత్ర సహకారములు, మానసిక సంతృప్తి వృద్ధి చెందును.

**పూ.ఫల్గుని** : వత్సరమంతయు గురువు ఆనుకూల్యత లేదు. వత్సరమంతయు శని, రాహు, కేతువుల ఆనుకూల్యత బాగున్నది.
కుటుంబ వ్యవహారములలో చికాకులు, ఇబ్బందులు, మిత్రుల సహకారం, ఆహారలోపం, ఆర్థిక వృద్ధి కలుగును.

**ఉ.ఫల్గుని:** మాటవిలువ తగ్గడం, ఆరోగ్య క్షీణత, శత్రువృద్ధి, అనవసర భయాలు, ద్రవ్యలాభం కలుగును.

**ఈ రాశి వారు ఈ సంవత్సరం ప్రతిరోజు శ్రీ గణేశ ద్వాదశ నామ స్తోత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

## కన్యా రాశి



**సౌర గోచారము : కన్యా మాసములో పుట్టిన వారికి**

**చాంద్ర గోచారము: ఉత్తరఫల్గుని 2, 3, 4; హస్త; చిత్ర 1, 2**

**నామ నక్షత్రము : టో, పా, పి, పూ, షం, ణ, ఠ, పే, పో**

**ఆదాయం 5, వ్యయం 5, రాజపూజ్యం 5, అవమానం 2**

**గురువు** : సెప్టెంబరు 14 వరకు 6న రజతమూర్తి. అంతటా నిదానముగా విజయములు సిద్ధించును. తదాది నవంబరు 20 వరకు 5న లోహ మూర్తి. చికాకులు, సంతాన మూలకంగా ధన నష్టము కలుగును. తదాది వత్సరపర్యన్తం 6న రజతమూర్తి. కొంత అనుకూలత కలుగును.

**శని** : ఈ వత్సరమంతయు 5న రజతమూర్తి. ఊహించని కష్టములు, ఊహ కందని చికాకులు తరచు కలుగును.

**రాహువు** : ఈ వత్సరమంతయు 9న తామ్రమూర్తి. అందరి సహాయ, సహకారాలు లభిస్తాయి.

**కేతువు** : ఈ వత్సరమంతయు 3న తామ్రమూర్తి. కార్యసిద్ధిని, అనారోగ్యమును కలుగ చేయును.

మొత్తము మీద ఈ రాశి వారికి గత యేడు వలె ఈ యేటి గ్రహస్థితి కూడా శుభాశుభ మిశ్రమంగా ఉన్నది. వివాహాది శుభకార్యముల నిర్వహణకు ఆర్థిక ఇబ్బందులు, విఘ్నాలు ఎక్కువగా ఎదురవుతూంటాయి. అపనిందలను వదిలిపెట్టి మీ కర్తవ్యాన్ని నిర్వహించడం ద్వారా ఉత్తమ ఫలితాలను పొందుతారు. సన్నిహితులతో హద్దులలో ఉండటం చాలా మంచిది. ఆరోగ్య, ఆర్థిక విషయాలలో దృష్టి ఎక్కువగా పెట్టవలసిన అవసరం వస్తుంది. విద్యార్థుల విద్యా వ్యాసంగము కొంత నత్తనడకగా సాగుతుంది.

**చైత్రం :** ఈ మాసములో శుక్ర, రాహు, కేతువులు శుభులు. కుజ, బుధులు అర్ధశుభులు. ప్రయత్న పూర్వకముగా చేసిన పనులు సంతృప్తిని ఇస్తాయి. విదేశీప్రయాణము భూ, గృహ సంబంధ ప్రయత్నములు ఫలిస్తాయి. కొన్ని సౌకర్యాలు అనుభవిస్తారు. ఆర్థికంగా అనుకూలత పెరుగుతుంది. నిరుద్యోగులకు ఉపాధి కలుగును. రావలసిన బకాయిలు కొంత వరకు వసూలు అవుతాయి. ప్రమోషన్ల వల్ల అననుకూల స్థాన చలనాలు జరుగుతాయి.

**వైశాఖం :** ఈ మాసములో కుజ, రాహు, కేతువులు శుభులు. రవి, బుధ, శుక్రులు అర్ధశుభులు. గత అనుభవాలు గుర్తుకు వస్తాయి. యోగ, ధ్యాన, ఆరాధనలు, ఏకాగ్రత చర్చలు, దర్యాప్తు విచారణలు, విందులు విహార వినోదాలు అనుకూలిస్తాయి. ద్వితీయార్థంలో అవసరమైనప్పుడు సహాయము చేయు స్నేహితులు, నూతన వస్త్రాభరణములను సంపాదించుట, వ్యవహార వ్యాజ్యములందు జయము కలుగును. కాంట్రాక్టు పనుల వలన లాభములు, భూమి కొనుట, పదవీ లాభము సిద్ధించును.

**జ్యేష్ఠం :** ఈ మాసములో రవి, కుజ, రాహు, కేతువులు శుభులు. బుధ, శుక్రులు అర్ధశుభులు. ఉద్యోగం మార్పు విషయంలో తొందరపడి ఒక నిర్ణయానికి రాకండి. తండ్రి మాటలను విన్నట్లే విని వదిలేయడం ఉచితం కాదు. దేవాలయ సమీపంలోని స్థలాన్ని కొనే ముందు సమర్థుల సలహా అవసరం. సాహిత్య సదస్సులలో పాల్గొనే అవకాశం ఉంది. వాహనంపై ప్రయాణం అంత మంచిది కాదు. స్త్రీలు ఇతరులతో మాట్లాడునప్పుడు జాగ్రత్తగా ఉండవలెను.

**ఆషాఢం :** ఈ మాసములో రవి, బుధ, శుక్ర, రాహు, కేతువులు శుభులు. కుజుడు అర్ధశుభుడు. ఆరోగ్యము మెరుగవును. వస్త్ర వ్యాపారులకు బేరములు చురుకుగా సాగుతాయి. సోదరులతో మైత్రీ ప్రయత్నము ఫలించును. కుటుంబమున స్త్రీ సహాయ సహకారములు లభించును. అప్పుల బాధ తగ్గుతుంది. ఉద్యోగులకు, అధికారులకు భేదాభిప్రాయములు పెరుగును. కోర్టు వ్యవహారాదులలో జోక్యం పనికిరాదు. మీ పనితీరులో ఆకస్మికమైన వింత మార్పు జరిగే సూచనలున్నాయి. ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుంది.

**శ్రావణం :** ఈ మాసములో శుక్ర, రాహు, కేతువులు శుభులు. రవి, బుధులు అర్ధ శుభులు. ఇతరుల వ్యవహారాలలో తలదూర్చటం వలన మాట పడక తప్పదు. జీవిత భాగస్వామితో ఘర్షణ రావచ్చు. ఆరోగ్యం విషయంలో ఎక్కువ శ్రద్ధ పట్టాలి. ప్రైవేట్ సంస్థలలో ఉన్నవారికి, ప్రభుత్వ ఉపాధ్యాయులకు అనుకూలం కాదు. స్పెక్యులేషన్‌పై ఆసక్తి పెరుగుతుంది. అన్నదమ్ములు, అక్కాచెల్లెళ్ళతో మెలకువగా వ్యవహరించాలి. కోర్టు వ్యవహారాలు అనుకూలించవు.

**భాద్రపదం :** ఈ మాసములో బుధ, గురు, శుక్ర, రాహు, కేతువులు శుభులు. రవి, కుజులు అర్ధశుభులు. ఏ పని మొదలు పెట్టినను కృతకృత్యులు అగుదురు. మంచి పేరు ప్రతిష్ఠలు వచ్చును. వివాహాది శుభకార్యములు తలవని తలంపుగా స్థిరపడగలవు. బయట ఎన్ని సమస్యలున్నను, ఆలుబిడ్డల గౌరవాభిమానములచే హృదయానంద మును పొందగలరు. మాసాంతంలో అనారోగ్యం, తల తిప్పుట ఎక్కువగా ఉండును. నిర్మాణ ప్రయత్నములు నిలిచిపోవును.

**ఆశ్వయుజం :** ఈ మాసములో బుధ, శుక్ర, రాహు, కేతువులు శుభులు. రవి, గురువులు అర్ధశుభులు. శుభకార్యక్రమాలకు ఈ మాసం బాగున్నది. ఒక ఆధ్యాత్మిక గురువు దర్శనం కలుగు తుంది. తీర్థయాత్రలు చేయుట, భార్యా భర్తలకు అవగాహన, స్త్రీమూలక ధనం, వ్యాపారాభివృద్ధి, ఋణ విముక్తి, నవవస్త్రాభరణ ప్రాప్తి, కళత్ర సౌఖ్యము, రాజకీయ నాయకులకు పదవీ యోగం, భూ వివాదం పరిష్కారమగుట కలుగును. వైజ్ఞానిక, ఆధ్యాత్మిక సమావేశాలలో, సదస్సులలో పాల్గొంటారు.

**కార్తికం :** ఈ మాసములో రవి, శుక్ర, రాహు, కేతువులు శుభులు. బుధ, గురువులు అర్ధశుభులు. అన్నివిధాల బాగున్నా శారీరక సమస్యలు అనేక ఇబ్బందులకు గురి చేస్తాయి. ఒక ప్రముఖ ఆధ్యాత్మిక గురుదర్శనం కలుగుతుంది. దూరపు బంధుమిత్రులు దగ్గర అవుతారు. వ్యవహారములు, కోర్టు వ్యాపారములు, అనుకూలముగా ఉండును. ఆశించిన ద్రవ్యం, కావలసిన వస్తువులు కాని పొందుతారు. మీ వాక్చాతుర్యంతో కుటుంబసభ్యుల మధ్య ఏకీభావం కలుస్తుంది. ఉద్యోగులకు బదిలీలు సక్రమంగా ఉండవు.

**మార్గశిరం :** ఈ మాసములో కుజ, శుక్ర, రాహు, కేతువులు శుభులు. రవి అర్ధశుభుడు. ఏ పని ఆరంభించినా విఘ్నాలు ఎదురవుతూ ఉంటాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. ప్రతి విషయంలో అనుమానం, ఆందోళనలు మానసిక వేదనకు గురి చేస్తాయి. భూ, గృహ విషయాలలో చికాకులు పెరుగును. విద్యార్థులకు విద్యాభ్యాసం కొంత కఠినంగా ఉంటుంది. ఫైనాన్స్ వ్యాపారులకు వ్యాపారం మందకొడిగా సాగును.

**పుష్యం :** ఈ మాసములో శుక్ర, రాహు, కేతువులు శుభులు. రవి, కుజులు అర్ధశుభులు. ఉన్నతమైన వ్యక్తులు మీ లక్ష్యసాధనకు తోడ్పడుతారు. గృహాలంకరణ విషయాలలో ఎక్కువ శ్రద్ధ చూపిస్తారు. అవివాహితులకు, నిరుద్యోగులకు కార్య విజయం. వృత్తి వ్యాపారములందు మంచి చెడ్డలు సమానంగా ఉండును. రియల్ ఎస్టేట్స్ వ్యాపారులకు ఆకస్మిక ధనలాభం ఉంటుంది. కోర్టు వ్యవహారములు వాయిదా కోరుట మంచిది.

**మాఘం :** ఈ మాసములో శుక్ర, రాహు, కేతువులు శుభులు. రవి అర్ధశుభుడు. ఆర్థికాభి వృద్ధికి, ఆర్థిక లావాదేవీలకు ఈ మాసం అనుకూలంగా ఉంటుంది. రావలసిన మొత్తం వసూళ్ళకు, చెల్లింపులకు ప్రయత్నిస్తారు. కొనుగోళ్ళు, అమ్మకాలు, విలువైన వస్తు సేకరణకు, డిపాజిట్లకు, వ్యాపారాభివృద్ధికి, పొదుపు పథకాలకు, పెట్టుబడులకు అనుకూలం. మాసాంతంలో అనారోగ్యం, తల తిప్పుట ఎక్కువగా ఉండును. నిర్మాణ ప్రయత్నములు నిలిచిపోవును.

**ఫాల్గునం :** ఈ మాసములో శుక్ర, రాహు, కేతువులు శుభులు. బుధుడు అర్ధశుభుడు. భార్యాబిడ్డలతో కీచులాటలు పెరిగి మానసికంగా స్థిమితం తగ్గుతుంది. ధన వ్యయము ఎక్కువ అవుతుంది. వ్యాపారస్థులకు వ్యయము ఎక్కువ అగును. అన్నింటా పనులు స్తంభిస్తాయి. విద్యార్థులకు చదువు మీద శ్రద్ధ తగ్గి, ఇతర విషయముల మీద శ్రద్ధ పెరుగుతుంది. ద్వితీయార్థంలో అవసరమైనప్పుడు సహాయము చేయు స్నేహితులు, నిపుణత, భూసంపాదన కలుగును.

### సంగ్రహ సంవత్సర ఫలం

**ఉ.ఫల్గుని :** వత్సరమంతయు గురు కేతువుల ఆనుకూల్యత లేదు. వత్సరమంతయు శని, రాహువుల ఆనుకూల్యత బాగున్నది.
వ్యావహారిక లాభములు, మనోల్లాసము, అలంకారం, సంపద వృద్ధి, పరోపకారత్వములు సిద్ధించును.

**హస్త** : వత్సరమంతయు గురువు ఆనుకూల్యత లేదు. వత్సరమంతయు శని, రాహు, కేతువుల ఆనుకూల్యత బాగున్నది.
కోపం, చికాకులు, స్వల్ప అనారోగ్యములు, అంతుబట్టని సమస్యలు, ఖర్చులు, బయటివారి సహకారములు సిద్ధించును.

**చిత్ర** : శారీరిక సౌఖ్యం, కార్యవిజయం, అనుకోని నష్టాలు, ఋణప్రాప్తి, గౌరవవృద్ధి, ద్రవ్యహాని, సుఖజీవనము సిద్ధించును.

**ఈ రాశి వారు ప్రతిరోజు శ్రీ హనుమాన్ చాలీసా పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

## తులా రాశి



**సౌర గోచారము : తులా మాసములో పుట్టిన వారికి**
**చాంద్ర గోచారము : చిత్ర 3, 4; స్వాతి; విశాఖ 1, 2, 3**
**నామ నక్షత్రము : రా, రి, రూ, రే, రో, తా, తీ, తూ, తే**
**ఆదాయం 2, వ్యయం 8, రాజపూజ్యం 1, అవమానం 5**

**గురువు** : సెప్టెంబరు 14 వరకు 5న లోహమూర్తి. అన్ని రంగాలలోను మానసిక ఆందోళన, చికాకులు పెరుగును. తదాది నవంబరు 20 వరకు 4న తామ్రమూర్తి. ఎంత శ్రమ చేసినను ఫలితము తక్కువగానే ఉండును. తదాది వత్సరపర్యన్తం 5న లోహమూర్తి. ఎన్ని ప్రయత్నములు చేసినను కార్యానుకూలత తక్కువగానే ఉండును.

**శని** : ఈ వత్సరమంతయు 4న లోహమూర్తి. అనారోగ్యములు, వ్యర్థభావనలు, వృధా కాలక్షేపములు పెరుగును. అన్ని రంగాలలో అడ్డంకులు ఏర్పడును.

**రాహువు** : ఈ వత్సరమంతయు 8న రజతమూర్తి. అంతటా విఘ్నములు ఎక్కువగా ఉండును.

**కేతువు** : ఈ వత్సరమంతయు 2న రజతమూర్తి. కుటుంబమునకు కొంత ఆర్థిక వృద్ధి కలుగును.

మొత్తము మీద ఈ రాశి వారికి ఈ సంవత్సరము శుభానుకూలత తక్కువగా ఉన్నది. శుభకార్యములకు ఆర్థిక ఇబ్బందులు, విఘ్నాలు ఎక్కువగా ఎదురవుతూ ఉంటాయి. విద్య, ఆరోగ్య, ఆర్థిక విషయాలలో వ్యతిరేకతలు ఎక్కువగా ఉంటాయి. విద్యార్థులు ప్రత్యేక కృషి ఎక్కువ పెట్టవలసిన అవసరం వస్తుంది. వ్యక్తిగత విషయాలను గోప్యంగా ఉంచడం మంచిది. సన్నిహితులతో హద్దులలో ఉండటం చాలా మంచిది. ఏమరపాటుగా ఉన్న మీ కర్తవ్య నిర్వహణలో అయిన వారి ద్వారా అపనిందలు పడే అవకాశాలు ఉన్నాయి. వ్యాపారస్థులకు క్రొత్త వ్యాపారములు మొదలు పెట్టుటకు ఈ సంవత్సరము అనుకూలము కాదు.

**చైత్రం :** ఈ మాసములో బుధుడు అర్ధశుభుడు. సహోద్యోగితో ఇబ్బందిలో పడతారు. అద్దె ఇల్లు మారే ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యాపారులు భాగస్వాముల మోసాన్ని గుర్తించాలి. చెడు అలవాట్లకు గురైన మిత్రులను మార్చే ప్రయత్నం చేస్తారు. వృద్ధ రాజకీయ నాయకులు రాణిస్తారు. శుభకార్యములు స్థిరపడగలవు. కుటుంబమున ఆలుబిడ్డల సౌఖ్యము ఉండును. వాగ్దానము చేసే వారు తమ వాగ్దానములను ఆచితూచి ఇవ్వవలెను.

**వైశాఖం :** ఈ మాసములో శుక్రుడు శుభుడు. బుధుడు అర్ధశుభుడు. వివాహాది శుభకార్య ప్రయత్నములకు అనుకూలించే సమయం ఆసన్నమైనది. నూతనోత్తేజం, ఉత్సాహం తొణికిసలాడుతుంది. విదేశీ గమనం, ఉన్నత విద్యలు, రచనలు, ప్రచురణలు బాగా అనుకూలిస్తాయి. ద్వితీయార్ధంలో భార్యాబిడ్డలతో కీచులాటలు పెరిగి మనస్థిమితం తగ్గుతుంది. ధనవ్యయము ఎక్కువ అవుతుంది. వ్యాపారస్థులకు వ్యయము ఎక్కువగును.

**జ్యేష్ఠం :** ఈ మాసములో రవి, కుజ, బుధ, శుక్రులు అర్ధశుభులు. అధిక ధనవ్యయము, నిరంతర ప్రయాణములు, అనారోగ్యము, దంపతుల మధ్య అవగాహనా లోపము, అకాల భోజనము, అనుకోని సమస్యలు ఎదురు అగును. బంధు, మిత్ర విరోధములు, వ్యాపారస్థులకు నష్టములు, శారీరక ఇబ్బందులు కలుగును. కోర్టు వ్యాజ్యాలు ఉన్నవారు వాయిదా కోరటం మంచిది. మిత్రులను దూరం పెట్టే అవకాశం ఉన్నది.

**ఆషాఢం :** ఈ మాసములో రవి, కుజులు శుభులు. బుధ, శుక్రులు అర్ధశుభులు. స్థిరాస్తి విషయంలో జాప్యం జరుగవచ్చు. మీ జీవిత భాగస్వామిపై శ్రద్ధ వహిస్తారు. శస్త్రచికిత్స, చంచల స్వభావం, భయం, అనారోగ్యం, వృధా వ్యయం, మానసిక చింత, గాయాలు తగలటం, ఊహించని అవమానాలు, సంపద వృద్ధి, మధ్యవర్తిత్వం నెరపుట, భూషణ ప్రాప్తి, దాయాదులతో కలహాలు పెరగటం, సంతానమూలక చింత, మనశ్శాంతి కోల్పోవుట, శత్రువృద్ధి, అధిక శ్రమ, దృష్టి దోషాలు ఎక్కువ అగుట, నిరుత్సాహం కలుగును.

**శ్రావణం :** ఈ మాసములో రవి, కుజ, శుక్రులు శుభులు. బుధుడు అర్ధశుభుడు. ముఖ్యులతో పెద్దలతో సంభాషించేటప్పుడు మెలకువ అవసరం. వ్యాపారుల ఓర్పు, నేర్పులకు పరీక్షా సమయం. కోర్టులలో వాయిదాలు కోరటం మంచిది. మాసాంతము నుండి ఆర్థికంగా పుష్టి కలగడం, భార్యకు అలంకార ప్రాప్తి, కుటుంబ సౌఖ్యం, జ్ఞానులతో సత్సంగం, గురువుల దర్శనము, తీర్థయాత్రలు చేయటం, దైవమునందు, గురువులయందు భక్తి శ్రద్ధలు కలుగును.

**భాద్రపదం :** ఈ మాసములో శుక్రుడు శుభుడు. రవి, బుధులు అర్ధశుభులు. కాంట్రాక్టు పనుల వలన లాభములు, భూమి కొనుట, పదవీ లాభము సిద్ధించును. సహోద్యోగులతో సంబంధాలు మెరుగుపడతాయి. ప్రైవేటు ఉద్యోగులకు శుభ పరిణామాలు కనిపిస్తాయి. వ్యవసాయాభివృద్ధి, ఫలసాయానికి ప్రోత్సాహంగా ఉంటుంది. జీవిత భాగస్వామి అనారోగ్యం ఆందోళన కల్గిస్తుంది. వాహనదారులకు ప్రాణభయం, అగ్నిభయం ఎక్కువవుతుంది. మేనమామలతో విరోధం, ధననష్టము కలుగును.

**ఆశ్వయుజం :** ఈ మాసములో శుక్రుడు శుభుడు. కుజ, బుధ, గురువులు అర్ధశుభులు. వృత్తి ఉద్యమాదులలో అనుకూలత, ధన లాభము, ఋణ నివృత్తి, కుటుంబ సుఖము, మంచి ఆరోగ్యము, సమాజ గౌరవము లభించును. దూర బంధువులకు వివాహాది శుభములు కలుగును. వ్యాపార వ్యవహారములందు అభివృద్ధి సిద్ధించును. శక్తికి మించిన కార్యములు చేయవలసి వచ్చును. గొప్ప వారితో స్నేహము, ప్రయాణ మూలకముగా ధనసిద్ధి కలుగును.

**కార్తికం :** ఈ మాసములో బుధ, శుక్రులు శుభులు. రవి, కుజ, గురువులు అర్ధశుభులు. బంగారము వ్యాపారులకు బేరము సాగి పూర్వము కంటె మేలుగా ఉండును. గృహంలో శుభకార్యములు జరుగుతాయి. కొన్ని ప్రయాణాలు స్థిరపడతాయి. విద్యార్థులకు మంచి ఫలితములు ఏర్పడుతాయి. వ్యాపారస్థులకు అనువైన కాలము. ఇతరుల ప్రీతికోసం బృంద కార్యక్రమాలు, సరదాల కోసం వ్యర్థంగా డబ్బును వెచ్చిస్తారు.

**మార్గశిరం :** ఈ మాసములో రవి, గురు, శుక్రులు శుభులు. ఆరోగ్యము, సంతోషము వృద్ధి చెందును. కుటుంబ సభ్యుల మధ్య ఏకీభావం కలుస్తుంది. ఇంజనీర్లకు, కాంట్రాక్టర్లకు బిల్లుల వసూళ్ళు ఆలస్యమగు సూచనలు కలవు. ఫైనాన్స్ వ్యాపారులు ఆచితూచి వ్యవహరించవలెను. కొత్త ప్రయాణములకు అవకాశములు కలుగును. విద్యార్థులు ఎంత చదివిన అర్థంకాక గుర్తించుకోలేక పోతారు. పిల్లల ప్రవర్తన తల్లికి, ఆందోళన కల్గిస్తుంది. వ్యాపారమున ఆశించిన లాభములు కొంత తగ్గును.

**పుష్యం :** ఈ మాసములో గురు, శుక్రులు శుభులు. రవి, కుజులు అర్ధశుభులు. అవివాహితులకు అనుకూలమైన కాలం. ఆర్థికంగా ఇబ్బంది అంటూ ఏమీ ఉండదు. ఏజెంట్లు, రియల్ ఎస్టేట్ వ్యాపారులు ఆందోళనకు గురవుతారు. విదేశీ వస్తువులపై ఆసక్తి పెరుగుతుంది. నిరుద్యోగులకు సదవకాశాలు లభించినా సద్వినియోగం చేసుకోలేరు. మీ చిన్నారుల గురించి చర్చిస్తారు. సులభంగా ఆర్థిక సహాయం లభిస్తుంది.

**మాఘం :** ఈ మాసములో కుజ, గురు, శుక్రులు శుభులు. రవి అర్ధశుభుడు. వివాహాది శుభకార్యములు స్థిరపడును. పుణ్య నదులలో స్నానము లభించగలదు. ఆర్థిక ఇబ్బందులతో చికాకులు పెరుగును. వర్తక, వ్యాపారములకు మధ్యముగా ఉన్నది. ఉద్యోగస్థులు వారి పై అధికారులతో జాగ్రత్తగా మెలగాలి. స్నేహితుల సహాయ సహకారములు బాగా లభించును. ఋణబాధలు తగ్గును. విద్యార్థులకు విద్యా వ్యాసంగము పెరుగును. కోపమును తగ్గించుకోవాలి.

**ఫాల్గునం :** ఈ మాసములో కుజ, గురు, శుక్రులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. అన్నివిధాల బాగున్నా శారీరక సమస్యలు అనేక ఇబ్బందులకు గురిచేస్తాయి. రైతులు అధికంగా శ్రమించాలి. సంతానాభివృద్ధి తొందరలో కలుగుతుంది. సినీ, కళా రంగాలలో వారికి మంచి ఆదరణ ఉంటుంది. జర్నలిజం చేసే వారికి ఉన్నత విద్య చేసే అవకాశం ఉన్నది. కోర్టు వ్యాపారములు, వ్యవహారములు అనుకూలముగా ఉండును. మీ ఆకర్షణలతో మిత్రులను, అభిమానులను సుముఖం చేసుకుంటారు.

### సంగ్రహ సంవత్సర ఫలం

**చిత్ర** : వత్సరాది మార్చి 1 వరకు గురువు అనుకూల్యత లేదు. తదాది వత్సర పర్యన్తం అనుకూల్యత బాగున్నది. వత్సరమంతయు శని, రాహు, కేతువుల అనుకూల్యత బాగున్నది.
అనవసరపు వ్యయము, మిత్రులతో ఇబ్బందులు, ఇష్టప్రాప్తి, సంతాన మూలక ఆనందము ప్రాప్తించును.

**స్వాతి** : వత్సరాది మే 21 వరకు గురువు అనుకూల్యత లేదు. తదాది జూలై 19 వరకు అనుకూల్యత బాగున్నది. తదాది జనవరి 2 వరకు అనుకూల్యత లేదు. తదాది మార్చి 1 వరకు అనుకూల్యత బాగున్నది. తదాది వత్సర పర్యన్తం అనుకూల్యత లేదు. వత్సరమంతయు శని, కేతువుల అనుకూల్యత బాగున్నది. వత్సరాది అక్టోబరు 5 వరకు రాహువు అనుకూల్యత లేదు. తదాది వత్సర పర్యన్తం అనుకూల్యత బాగున్నది.
తరచు పనులకు ఆటంకాలు, కొంత ధనలాభం, తరచు అనారోగ్యం, విదేశీ ప్రయాణ అవకాశములు సిద్ధించును.

**విశాఖ** : వృధా వివాదాలు, మానసిక వ్యాకులత, శారీరక బడలికలు, అనవసర విచారములు, అధిక ఖర్చులు పెరుగును.

**ఈ రాశి వారు ఈ సంవత్సరం ప్రతిరోజు శ్రీ లక్ష్మీ నారాయణ హృదయ స్తోత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

## వృశ్చిక రాశి



**సౌర గోచారము : వృశ్చిక మాసములో పుట్టిన వారికి**
**చాంద్ర గోచారము : విశాఖ 4; అనూరాధ, జ్యేష్ఠ**
**నామ నక్షత్రము : తో, నా, నీ, నూ, నె, నో, యా, యీ, యు**
**ఆదాయం 8, వ్యయం 14, రాజపూజ్యం 4, అవమానం 5**

**గురువు** : సెప్టెంబరు 14 వరకు 4న తామ్రమూర్తి. ఎంత శ్రమ చేసినను ఫలితము తక్కువగానే ఉండును. తదాది నవంబరు 20 వరకు 3న రజతమూర్తి. శుభాశుభములు మిశ్రమముగా ఉండును. తదాది వత్సరపర్యన్తం 4న తామ్రమూర్తి. అనారోగ్యం, ధనవ్యయం, చికాకులు మొదలగునవి ఎక్కువగా ఉండును.

**శని** : ఈ వత్సరమంతయు 3న తామ్రమూర్తి. విఘ్నములను అతిక్రమించి కార్యసిద్ధిని పొందగలరు. తరచు అనారోగ్య భావములను కలుగచేయును.

**రాహువు** : ఈ వత్సరమంతయు 7న సువర్ణమూర్తి. అన్ని రంగములలో విషమ సమస్యలు తీరును. సౌఖ్యము పెరుగును.

**కేతువు** : ఈ వత్సరమంతయు 1న సువర్ణమూర్తి. వివాహాది మంగళకార్యములు అతికష్టమున నెరవేరును.

మొత్తము మీద వీరికి ఈ సంవత్సరము శుభాశుభ మిశ్రమంగా ఉన్నది. శుభకార్యములు బంధువుల సహకారంతో పూర్తి చేయగలుగుతారు. ఆర్థికవృద్ధి బాగా ఉన్నప్పటికిని సమయానికి కొన్ని చేతికి అందక పోవటం కలవరపెడుతూ ఉంటుంది. వృత్తివ్యవహారాలలో కొత్తవి చేపట్టకుండా ఉండటం మంచిది. విద్యా వ్యాసంగానికి తరచు అవాంతరాలు ఏర్పడుతూ ఉంటాయి. ఆరోగ్యం కొద్దిగా నిలకడగానే ఉంటుంది. నిరుద్యోగులకు కొంత నిరాశగానే ఉంటుంది. ఉద్యోగస్తులు క్రొత్త వాటికి ప్రయత్నం చేయడం అంత శుభసూచకము కాదు. అపూర్వ దేవతా దర్శనము, పుణ్యనదీ తీర్థ స్నానము లభించును.

**చైత్రం :** ఈ మాసములో గురు, శనులు శుభులు. బుధ, రాహు, కేతువులు అర్ధశుభులు. ఆరోగ్యము వృద్ధి చెందును. కుటుంబ సభ్యుల మధ్య ఏకీభావం కలుస్తుంది. ఇంజనీర్లకు బిల్లుల వసూళ్ళు ఆలస్యమగు సూచనలు కలవు. ఫైనాన్స్ వ్యాపారులు ఆచితూచి వ్యవహరించాలి. డబ్బు మంచినీళ్ల ప్రాయంలా ఖర్చవుతుంది. నూతన ప్రయాణములకు అవకాశములు కలుగును. కోర్టు వ్యవహారములు అనుకూలముగా ఉండును.

**వైశాఖం :** ఈ మాసములో గురు, శనులు శుభులు. బుధ, శుక్ర, రాహు, కేతువులు అర్ధశుభులు. కోర్టు వ్యవహారాదులు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగులకు అభివృద్ధి ఉండి, కోరిన చోట్లకు బదిలీలు పొందగలరు. కుటుంబ సుఖము, మంచి ఆరోగ్యము, సమాజ గౌరవము లభించును. నిర్మాణ ప్రయత్నములు, దూర బంధువులకు వివాహాది శుభములు కలుగును. విద్యార్థులు ఎంత చదివిన అర్థంకాక గుర్తించుకోలేక పోతారు.

**జ్యేష్ఠం :** ఈ మాసములో గురు, శుక్ర, శనులు శుభులు. బుధ, రాహు, కేతువులు అర్ధశుభులు. వైజ్ఞానిక, ఆధ్యాత్మిక చర్చలలో పాల్గొంటారు. కొనుగోళ్ళ విషయంలో శ్రద్ధ అవసరము. అనారోగ్యం ఎక్కువగా ఉండును. నూతన వస్తువులు లభించును. అపనిందలు తొలగి మంచి పేరు లభించును. సంగీత విద్వాంసులకు గౌరవ, ప్రతిష్ఠలు సన్నగిల్లును. కోర్టు వ్యవహారములు వాయిదా కోరుట మంచిది. నిర్మాణ ప్రయత్నములు నిలిచి పోవును. నిరుద్యోగులకు ఉపాధి లభించును. తగాదాలు తీర్చుట యందు పేరొందుదురు. ప్రభుత్వ ఉద్యోగుల ప్రమోషన్లకు అనుకూలంగా ఉన్నది.

**ఆషాఢం :** ఈ మాసములో గురు, శనులు శుభులు. రవి, కుజ, బుధ, శుక్ర, రాహు, కేతువులు అర్ధశుభులు. విద్యార్థులు అనవసర విషయాలపై దృష్టి పెట్టరాదు. వివాహాది శుభకార్యములు నిర్విఘ్నంగా సాగుతాయి. ఉద్యోగులకు సరియగు అభివృద్ధికరంగా ఉంటుంది. గృహంలో మార్పులకు, చేర్పులకు ఇది తగిన సమయం. ఆధ్యాత్మిక చింతన పెరుగుతుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కోర్టు వ్యాపారములు, వ్యవహారములు అనుకూలముగా ఉండును.

**శ్రావణం :** ఈ మాసములో రవి, బుధ, గురు, శుక్ర, శనులు శుభులు. కుజ, రాహు, కేతువులు అర్ధశుభులు. అనవసరపు ఖర్చు ఎక్కువ చేస్తారు. రావలసిన బకాయిలు సకాలంలో అందుట కష్టము. అధికశ్రమ వలన ఆరోగ్యం మందగిస్తుంది. ద్వితీయార్ధం నుండి కాస్త అనుకూలంగా ఉన్నది. గృహమరమ్మత్తులు, గృహనిర్మాణాలకు ఆలోచన చేస్తారు. కోర్టు వ్యవహారాలకు అనుకూలం. ఉద్యోగులకు కొన్ని మార్పులు రావచ్చు. కాంట్రాక్టు పనుల వలన లాభములు, పదవీ లాభము సిద్ధించును.

**భాద్రపదం :** ఈ మాసములో రవి, కుజ, శుక్ర, శనులు శుభులు. బుధ, రాహు, కేతువులు అర్ధశుభులు. వివాహాది శుభ కార్యములు నిశ్చయం చేసుకుంటారు. వైజ్ఞానిక, ఆధ్యాత్మిక సమావేశాలలోను, సదస్సులలోను ఉత్సాహంగా పాల్గొంటారు. ద్వితీయార్ధంలో అన్నింటా పనులు స్తంభిస్తాయి. విద్యార్థులకు చదువుమీద శ్రద్ధ తగ్గి, ఇతర విషయముల మీద శ్రద్ధ పెరుగుతుంది. ఎవరి విషయంలో మీకు ఆసక్తి, అనురాగం ఉన్నాయో వారి మూలంగా మీకు ఆనందం కలగకపోవచ్చు.

**ఆశ్వయుజం :** ఈ మాసములో శుక్ర, శనులు శుభులు. రవి, కుజ, బుధ, రాహు, కేతువులు అర్ధశుభులు. గత అనుభవాలు గుర్తుకు వస్తాయి. దైవ సందర్శనము, మిత్రుల సహకారం, దానధర్మములు చేయుట, సంతానమునకు అభివృద్ధి కలుగును. వ్యాపారస్థులకు ధన నష్టములు, మిత్రులకు అనారోగ్యము, శారీరిక ఇబ్బందులు కలుగును. రైతులకు వాతావరణం అనుకూలించక మానసిక చింతెక్కువగా ఉంటుంది.

**కార్తికం :** ఈ మాసములో శుక్ర, శనులు శుభులు. రవి, బుధ, రాహు, కేతువులు అర్ధశుభులు. ఆధ్యాత్మిక చింతన పెరుగుతుంది. విద్యార్థులు అనవసర విషయాలపై దృష్టి పెట్టరాదు. ఉద్యోగులకు అభివృద్ధికరంగా ఉంటుంది. వ్యవహారాదులలో పరస్పర అవగాహన కుదురుతుంది. గృహంలో మార్పులకు, చేర్పులకు ఇది తగిన సమయం. వివాహాది శుభకార్యములకు విఘ్నాలు ఎక్కువగును. మాసాంతంలో పరిమితులు తప్పిన ఆహారపానీయాల వల్ల ఆరోగ్యం ఇబ్బంది పెడుతుంది. నిద్రలేమి బాధిస్తుంది. ఇచ్చి పుచ్చుకునే వ్యవహారాలలో మెలకువ వహించాలి.

**మార్గశిరం :** ఈ మాసములో బుధ, శుక్ర, శనులు శుభులు. రవి, కుజ, రాహు, కేతువులు అర్ధశుభులు. అప్పు చేయవలసి రావచ్చును. ఇంటాబయిటా పేచీలు అధిక మగును. ఉద్యోగులు దూరప్రాంతములకు బదిలీ అగుదురు. వివాహాది శుభ కార్యములకు ఎక్కువ ఆటంకములు ఏర్పడును. కుటుంబంలో చికాకులు, అశాంతి పెరుగుతాయి. దూరప్రయాణాలకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. రిప్రజెంటేటివ్‌లు ఆందోళనకు గురి అవుతారు.

**పుష్యం :** ఈ మాసములో రవి, శుక్ర, శనులు శుభులు. కుజ, రాహు, కేతువులు అర్ధశుభులు. మధ్యవర్తిత్వం వహించటం మంచిది కాదు. చిన్న తరహా పరిశ్రమలోని వారికి పురోభివృద్ధి. స్త్రీలు ఆవేదనకు లోనవుతారు. చిన్న పిల్లలకు చిన్న చిన్న ఆరోగ్య సమస్యలు ఎదురవుతాయి. వైద్యం, ఇంజనీరింగ్ రంగాలలో వారికి అనుకూలమైన కాలం. ఇంటర్వ్యూలలో విజయం సాధించినా ఫలిత నిర్ణయాలు ఆలస్యం కావచ్చు. మిత్రులను కొంతకాలం దూరం పెట్టే అవకాశం ఉన్నది.

**మాఘం :** ఈ మాసములో శుక్ర, శనులు శుభులు. రవి, రాహు, కేతువులు అర్ధ శుభులు. ప్రతి విషయంలో అనుమానం, ఆందోళనలు మానసిక వేదనకు గురి చేస్తాయి. ధనం విపరీతంగా ఖర్చవుతుంది. చేస్తున్న వృత్తి, వ్యాపారాల్లో, ఉద్యోగాలలో ప్రమోషన్లు, బదిలీలు అధికంగా ఉంటాయి. దైవ దర్శన ప్రయత్నాలు ఫలిస్తాయి.

**ఫాల్గునం :** ఈ మాసములో శుక్ర, శనులు శుభులు. రవి, రాహు, కేతువులు అర్ధ శుభులు. మిత్రులను కొంతకాలం దూరం పెట్టే అవకాశం ఉన్నది. దూరప్రయాణాలు లాభిస్తాయి. పైకి చురుకుగా కనపడక పోయినప్పటికి విద్యార్థులు పరీక్షలలో విజయాలను పొందుతారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. వెండి, బంగారు వ్యాపారులను నమ్మిన మిత్రులు మోసం చేస్తారు. అధిక శ్రమతో, ఆందోళనలతో పనులు చాలా ఆలస్యంగా పూర్తి అవుతాయి.

### సంగ్రహ సంవత్సర ఫలం

**విశాఖ** : వత్సరాది మే 21 వరకు గురువు ఆనుకూల్యత బాగున్నది. తదాది జూలై 19 వరకు ఆనుకూల్యత లేదు. తదాది జనవరి 2 వరకు ఆనుకూల్యత బాగున్నది. తదాది వత్సరపర్యన్తం ఆనుకూల్యత లేదు. వత్సరాది ఫిబ్రవరి 17 వరకు శని ఆనుకూల్యత బాగున్నది. తదాది వత్సరపర్యన్తం ఆనుకూల్యత లేదు. వత్సరమంతయు రాహువు ఆనుకూల్యత లేదు. వత్సరాది ఫిబ్రవరి 8 వరకు కేతువు ఆనుకూల్యత లేదు. తదాది వత్సరపర్యన్తం ఆనుకూల్యత బాగున్నది.
అనవసరపు ఖర్చులు, పనులకు ఆటంకాలు, అనారోగ్య భావన, పాత బకాయిల వసూళ్ళు, ఆదాయ వృద్ధి కలుగును.

**అనూరాధ** : వత్సరమంతయు గురు కేతువుల ఆనుకూల్యత లేదు. శని రాహువుల ఆనుకూల్యత బాగున్నది.
అనవసర ఆందోళన, బంధువుల సహకారము, ఆకస్మిక ధనలాభం, సోమరితనము పెరుగుట కలుగును.

**జ్యేష్ఠ** : వత్సరమంతయు గురువు ఆనుకూల్యత లేదు. వత్సరమంతయు శని, రాహు, కేతువుల ఆనుకూల్యత బాగున్నది.
సువర్ణాభరణ ప్రాప్తి, అకారణ వైరాలు, సంతానముతో ఇబ్బందులు, అనారోగ్యం, కార్యసిద్ధి, వృథా ఖర్చు పెరుగును.

**ఈ రాశి వారు ఈ సంవత్సరం ప్రతిరోజు శ్రీ నమక స్తోత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

## ధనూ రాశి



**సౌర గోచారము : ధనుర్మాసములో పుట్టిన వారికి**
**చాంద్ర గోచారము : మూల, పూర్వాషాఢ; ఉత్తరాషాఢ 1**
**నామ నక్షత్రము : యే, యో, భా, భి, భూ, ధ, ఫ, ఢ, భే**
**ఆదాయం 11, వ్యయం 5, రాజపూజ్యం 7, అవమానం 5**

**గురువు** : సెప్టెంబరు 14 వరకు 3న రజతమూర్తి. శుభాశుభములు మిశ్రమముగా ఉండును. తదాది నవంబరు 20 వరకు 2న సువర్ణమూర్తి. విరోధములు ఏర్పడినను, శ్రమ మీద కార్యసిద్ధి యగును. తదాది వత్సరపర్యన్తం 3న సువర్ణమూర్తి. అయినవారి సహాయ సహకారములు బాగా లభించును.

**శని** : ఈ వత్సరమంతయు 2న రజతమూర్తి. ఆర్థిక ఇబ్బందులు సర్దు కుంటాయి. మంచి చెడుల మిశ్రమముగా ఉండును.

**రాహువు** : ఈ వత్సరమంతయు 6న లోహమూర్తి. తరచు కొంతమేర అప్పులు, అనారోగ్యములు పెరుగును.

**కేతువు** : ఈ వత్సరమంతయు 12న లోహమూర్తి. వ్యవహారము లందు అంతటా వ్యతిరేకతలు పెరుగును.

మొత్తము మీద ఈ రాశి వారికి ఈ సంవత్సరము చాల సామాన్యముగానే ఉన్నది. శుభకార్యముల నిర్వహణకు తరచు అవాంతరాలు ఏర్పడుతూ ఉంటాయి. ఆర్థికంగా పురోగతి తక్కువగా ఉండటం ఎక్కువగా కలవర పెడుతూ ఉంటుంది. వ్యాపార, వృత్తి వ్యవహారాలలో కొత్తవి చేపట్టకుండా ఉండటం మంచిది. ప్రభుత్వ, కోర్టు వ్యవహారాదులలో వ్యతిరేకతలు ఎక్కువగా ఉంటాయి. ఆరోగ్యం, విద్య, విదేశీ గమనం, ఉద్యోగ పరిస్థితులలో నిలకడ తక్కువగా ఉంటుంది. వత్సరాంతములో ఆర్థిక పరిస్థితి కొంత వరకు మెరుగుపడుతుంది.

**చైత్రం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. రవి, బుధ, గురువులు అర్ధ శుభులు. జర్నలిజం చేసే వారికి ఉన్నత విద్య చదివే అవకాశం ఉన్నది. విద్యార్థులకు కళలపై ఆసక్తి పెరుగుతుంది. లాయర్లు, డాక్టర్లు కృషికి మించి ధనార్జన చేయగలరు. ఉద్యోగులు బదిలీలు కోరకుండుట మేలు.కోర్టు వ్యాపారములు, వ్యవహారములు అనుకూలముగా ఉండును. కీర్తి ప్రతిష్ఠలు పెరుగును. కుటుంబ సౌఖ్యం పెరుగును. వ్యవహారాదుల్లో జయం, స్పెక్యులేషన్ ద్వారా ఆకస్మిక ధనప్రాప్తి కలుగును.

**వైశాఖం :** ఈ మాసములో రాహువు శుభుడు. బుధ, గురువులు అర్ధశుభులు. ప్రథమార్ధంలో అన్ని రంగాల వారికి శుభంగానే ఉన్నది. ద్వితీయార్ధం నుండి ఊహించని సన్నివేశాలు మీ విషయంలో విస్మయాన్ని కలుగచేస్తాయి. భూ, గృహ, వాహన విషయాలలో చికాకులు పెరుగును. విద్యార్థులు అధ్యాపకుల నుంచి నిరసనలు ఎదుర్కొంటారు. ప్రభుత్వ రంగంలో ఉన్నవారికి ఒత్తిడి పెరుగుతుంది. మహిళలకు, చిన్న పిల్లలకు గొంతుకు సంబంధించిన బాధలు అధికంగా ఉంటాయి. సంతానము వలన అభివృద్ధి కలుగును. షేర్ల లావాదేవీలలో నిదానం అవసరం.

**జ్యేష్ఠం :** ఈ మాసములో రాహువు శుభుడు. బుధ, గురు, శుక్రులు అర్ధశుభులు. మానసిక ఆందోళనలుంటాయి. సంతానరీత్యా చిక్కులు ఎదుర్కొంటారు. ఉదర, శిర స్సంబంధ అనారోగ్యాలకు గురి కావచ్చు. రాత్రి వేళ ప్రయాణాలు పనికిరావు. విద్యార్థులకు మిశ్రమ ఫలితాలు లభిస్తాయి. ఉద్యోగస్తులకు అనుకూల కాలం. గుర్తింపు, గౌరవం లభిస్తాయి. వ్యాపారస్తులకు ఆహ్లాదంగా, ధనార్జనలో ముందుకు సాగుతారు. ఉన్నత పదవులలోని వ్యక్తులు మీ లక్ష్య సాధనకు తోడ్పడతారు.

**ఆషాఢం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. బుధ, గురువులు అర్ధశుభులు. ఊహించని సన్నివేశాలు మీ విషయంలో విస్మయాన్ని కలుగచేస్తాయి. ఆర్థిక విషయాలలో వత్తిడి ఎక్కువవుతుంది. ఆరోగ్యం మందగిస్తుంది. పనులలో చికాకు పెరుగుతుంది. ఆధ్యాత్మికవేత్త దర్శన భాగ్యంతో మానసిక ప్రశాంతత కలుగుతుంది. ఆ గురువుని సేవించిన వేదాంత మార్గంలో ఉన్నత స్థితికి చేరుకుంటారు. ఆరోగ్య విషయంలో శ్రద్ధ పట్టి వైద్యసలహాలు పాటించాలి.

**శ్రావణం :** ఈ మాసములో రాహువు శుభుడు. రవి, బుధ, గురువులు అర్ధశుభులు. విరోధులు ఎక్కువ అవుతారు. వివాహాది శుభకార్యములకు ప్రతిబంధకములు ఏర్పడు సూచనలు ఉన్నాయి. కొన్ని వ్యవహారములు చికాకు అనిపించును. కళత్రసౌఖ్యం పెరుగుతుంది. వైద్యులకు, లాయర్లకు అధికాదాయం కలుగుతుంది. ఆకస్మికంగా మీలో వేదాంత ధోరణి కనిపిస్తుంది. స్థిర, చరాస్థుల విషయంలో ఒక నిర్ణయానికి రాగలుగుతారు. విద్యార్థులు విద్యావిషయాలపై, క్రీడలపై ఎక్కువ శ్రద్ధ చూపుతారు.

**భాద్రపదం :** ఈ మాసములో రవి, బుధ, గురు, శుక్ర, రాహువులు శుభులు. కుజుడు అర్ధశుభుడు. ఆరోగ్యం విషయంలో మెలకువ అవసరం. విశ్రాంతికి చేసే ప్రయత్నాలు అనుకూలించవు. కుటుంబ సభ్యుల ధోరణి ఆశ్చర్యం కలిగిస్తుంది. వ్యాపారస్థులకు సంతృప్తి ఉండదు. స్త్రీలకు గుర్తింపు, రాణింపు ఉంటాయి. సోదరమూలకంగా అనుకున్న పనులు నెరవేరతాయి. మాసాంతములో ప్రతి చిన్న విషయం మానసిక ఒత్తిడిని పెంచడం వల్ల అనారోగ్యం కలిగే అవకాశముంది.

**ఆశ్వయుజం :** ఈ మాసములో రవి, కుజ, బుధ, శుక్ర, రాహువులు శుభులు. గురువు అర్ధశుభుడు. కొన్ని సమస్యలు పరిష్కారవుతాయి. కొన్ని సౌకర్యాలు అనుభవిస్తారు. ఆర్థికంగా అనుకూలత పెరుగుతుంది. అప్పులు వసూలు చేయటంలో నైపుణ్యాన్ని చూపిస్తారు. విద్యార్థులు అధ్యాపకుల స్థాయిని బట్టి మసులుకోవాలి. మార్కెటింగ్, పర్యాటక రంగాల వారికి పదోన్నతి కలుగుతుంది. వృత్తి, ఉద్యోగ, వ్యాపార వ్యవహారాలలో సమస్యలున్నా సహనంతో పరిష్కరించుకుంటారు.

**కార్తికం :** ఈ మాసములో కుజ, బుధ, శుక్ర, రాహువులు శుభులు. రవి, గురులు అర్ధశుభులు. కాంట్రాక్టు పనుల వలన లాభములు, భూమి కొనుట, పదవీ లాభము సిద్ధించును. సహోద్యోగులతో సంబంధాలు మెరుగుపడతాయి. ప్రభుత్వేతర ఉద్యోగులకు శుభపరిణామాలు కనిపిస్తాయి. వ్యవసాయాభివృద్ధి, ఫలసాయానికి ప్రోత్సాహంగా ఉంటుంది. భూ, గృహ సంబంధ ప్రయత్నములు ఫలించును. గృహంలో మార్పులకు, చేర్పులకు ఇది తగిన సమయం.

**మార్గశిరం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. వాహన సౌఖ్యం, సంఘంలో పేరు, రాజకీయ నాయకుల పరిచయము, ప్రభుత్వ అధికారులతో సఖ్యత, వ్యాపారమందు సంతృప్తి కలుగును. కుటుంబ సౌఖ్యము పెరుగును. అప్పుల బాధ తగ్గుతుంది. భాగస్వాములలో కలహము, ఆకస్మిక ప్రయాణములు, ధననష్టం కలుగును. వస్త్ర వ్యాపారులకు బేరములు చురుకుగా సాగుతాయి. మాసాంతమున దాన ధర్మములు చేయుట, పదవీ లాభము సిద్ధించును. భూ, గృహసంబంధ ప్రయత్నములు ఫలించును.

**పుష్యం :** ఈ మాసములో బుధ, శుక్ర, రాహువులు శుభులు. రవి, కుజులు అర్ధశుభులు. అన్నింటిలోను విజయావకాశాలతో ముందుకు సాగుతారు. విధుల నిర్వహణలో అకుంఠిత దీక్ష చూపిస్తారు. సోదరులు పరస్పరం సహాయము చేసుకుంటారు. కొన్ని సమస్యలు పరిష్కారవుతాయి. అప్పు వసూలు చేయటంలో నైపుణ్యాన్ని చూపిస్తారు. మార్కెటింగ్, పర్యాటక రంగాల వారికి పదోన్నతి కలుగుతుంది. మాసాంతములో అకారణ వైరాలు, పరాజయాలు, అధికారుల ఆగ్రహానికి గురి కావటం, మనోవేదనలు కలుగును.

**మాఘం :** ఈ మాసములో రవి, బుధ, శుక్ర, రాహువులు శుభులు. కుజుడు అర్ధ శుభుడు. శుభ కార్యములు ఆలస్యమగు సూచనలు ఉన్నాయి. అప్పులు చేయ వలసిన పరిస్థితులు ఏర్పడును. ఉద్యోగులకు ఆటంకములతో కూడిన వేతన అభివృద్ధి కలుగును. కోర్టు వ్యవహారములు అలస్యము కావు. మాట విలువ తగ్గును. కుటుంబ వ్యవహారములు చికాకును కలిగించును. ఫైనాన్స్ వ్యాపారులు, కంపెనీ యజమానులు ఆచితూచి అడుగులు వేయవలయును.

**ఫాల్గునం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. రవి, కుజులు అర్ధశుభులు. ఉద్యోగులకు అధిక శ్రమ, పనిభారం తప్పవు. అపరాలు, ధాన్యం వ్యాపారులకు అభివృద్ధి కనిపిస్తుంది. భార్యతరపు బంధువుల నుండి శుభవార్త వింటారు. జ్ఞాపక శక్తి లోపించటం వల్ల స్త్రీలు ఆందోళనకు గురవుతారు. ఆర్థిక విషయాలలో సంతృప్తి ఉన్నప్పటికీ పొదుపు సాధ్యం కాదు. నూతన వ్యక్తుల పరిచయం సంతృప్తినిస్తుంది. ఉద్యోగ, వృత్తి, వ్యాపారాలలో ప్రోత్సాహం లభిస్తుంది.

### సంగ్రహ సంవత్సర ఫలం

**మూల** : వత్సరమంతయు గురు, రాహు, కేతువుల అనుకూల్యత బాగున్నది. వత్సరమంతయు శని ఆనుకూల్యత లేదు.
మాటవిలువ తగ్గడం, అనవసర భయాలు, కోపం, అధిక ఖర్చులు అంతుబట్టని సమస్యలు పెరుగును.

**పూర్వాషాఢ** : వత్సరమంతయు గురువు ఆనుకూల్యత లేదు. వత్సరమంతయు శని, రాహు, కేతువుల ఆనుకూల్యత బాగున్నది.
అనారోగ్యములు, వృథా వ్యయములు, కీర్తి ప్రతిష్ఠలు సన్నగిల్లడం, మధ్య వర్తిత్వములు, స్నేహబాంధవ్యాలు పెరుగును.

**ఉత్తరాషాఢ** : ఆరోగ్యం, ఇష్టప్రాప్తి, ఊహించని లాభాలు, గృహప్రాప్తి, ఆనందము సిద్ధించును.

**ఈ రాశివారు ఈ సంవత్సరం ప్రతిరోజు శ్రీ శివ సహస్ర నామ స్తోత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

